# జమీన్ రైతు

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 67 సంచిక: 12
21-3-1986
శుక్రవారం
16 పేజీలు: రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడు గారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

# రామారావు అదురు దెబ్బ!

రాజ్యసభ ఎన్నికల ఫలితాలు రాజకీయవాదుల వూహలను, అంచనాలను తల్లక్రిందులు చేశాయి. ముఖ్యమంత్రి శ్రీ రామారావు చివరినిమిషంలో పరమ నాటకీయంగా పాలిస్‌ను రంగంలోకిదింపి లాకీలను ఝళిపించి, సభ్యులను భయభ్రాంతులను చేయడంద్వారా తనపార్టీలో ఐక్యతను కాపాడుకోగలిగారు; మొదటి లెక్కింపులోనే తన అభ్యర్థులు ఐదుగురినీ గెల్పించుకోగలిగారు; అజేయుడనిపించుకోగలిగారు!

కాపిడి ఎన్ని వంకలుదిరిగినా ఇల్లు చేరడం ప్రధానమంటారు; ఎన్ని ఎత్తుగడలేసినా, ఎన్ని నాటకాలాడినా, ఎన్ని వ్యూహాలు పన్నినా ఎన్నికలలో విజయమే ప్రధానం కాబట్టి, ముఖ్యమంత్రి శ్రీ రామారావు ఒకేప్రక్రియ ద్వారా రెండవసారికూడా అదురుదెబ్బ కొట్టగలిగారు; తనపార్టీ అభేద్యమని మరొకమారు చాటుకోగలిగారు!

## విజయోత్సవాలలో తె. దే.- చార్జిషీటు తయారీలో కాంగ్రెస్!

ఓటిపడవ కాంగ్రెస్‌దేనని ఈ సారి కూడా రుజువైంది. కాంగ్రెస్ అభ్యర్థి గెల్పనమాట నిజమేకాని; అది చావుదప్పి కన్ను లొట్టబోయినట్టుగా జరగడం వల్ల కాంగ్రెస్ నాయకులలో విజయోత్సాహానికి ఆస్కారం లేకుండాపోయింది.

మార్క్సిస్టుపార్టీ తెలుగుదేశంను బలపరచడంద్వారా తనవ్యక్తిత్వాన్ని కోల్పోయింది. అట్లనే జనతా సి. పి. ఐ. అభ్యర్థిని బలపరచి, రెండవ ఓటుకు సంబంధించి ఆపార్టీచేతనే మోసానికి గురికావలసివచ్చింది. స్వతంత్ర అభ్యర్థిని బలపరచిన బి. జె. పి. కూడ అంతే; తన ఎనిమిది రెండవ ఓట్లను ముద్రగా సి. పి. ఐ. కి అర్పించిందికాని, వారిరెండవ ఓటును తాను బలపరచిన అభ్యర్థికి తెచ్చుకోలేకపోయింది. రెండవ లెక్కింపులోనే ఓటమి తప్పించుకోలేకపోయిన సి. పి. ఐ. రెండు మిత్రపక్షాలకు విజయవంతంగా టోపి పెట్టగలిగింది!

తిరుగుబాటు అభ్యర్థిగా రెండుసార్లు జయపతాకను ఎగురవేసిన ఎ. ఎస్. చౌదరి ఈసారి ఓటమి చవిచూడక తప్పలేదు. పాలిస్ పట్టుకొని పరువుతీస్తుందనే భయోత్పాతంలేకుంటే రాజకీయం బజారువస్తువో కాదో తెలిసుండేది!

ఎన్నికలో ఓట్ల వివరాలివీ-

శాసనసభలో ప్రస్తుతం వున్న సభ్యుల సంఖ్య 294. ఇందులో కాళహస్తి ఎన్నికను హైకోర్టు రద్దుచేసింది: తీవ్రవాదకమ్యూనిస్టుఒకరు ఎన్నికనుబహిష్కరించారు; మజ్లిస్ సభ్యులొకరు హాజరు కాలేదు: ఒక ఓటు చెల్లలేదు ఈ నాలుగు ఓట్లుపోగా నికరంగా వివిధ అభ్యర్థుల మధ్య పంపకమైన ఓట్లు 290.

ఈ 290 ఓట్లలో తెలుగుదేశం అభ్యర్థులు ఐదుగురికి కలిసి 212; కాంగ్రెస్ 41; సర్వారాయుడు చౌదరి 23; సి.పి.ఐ. 14 పంచుకున్నారు. ఇవన్నీ మొదటి ఓట్లు.

వివిధ అభ్యర్థులకువచ్చిన మొదటి ఓట్లు - తెలుగుదేశం-రావు గోపాలరావు 43, టి. మనోహర్ 43, డాక్టర్ డి. విజయమోహనరెడ్డి 42, కె. ప్రభాకర్ 42, శ్రీమతి రేణుకాచౌదరి 42: కాంగ్రెస్- జి. స్వామినాయక్ 41; స్వతంత్రుడు-ఎ. ఎస్. చౌదరి 23; సి.పి.ఐ.- నీలం రాజశేఖరరెడ్డి-14. ఇందులో రాజశేఖరరెడ్డిని బలపరచిన జనతా సభ్యులు ముగ్గురూ తమ రెండవ ఓటును చౌదరికి వేసినందువల్ల, అవి మొదటివై చౌదరి బలం 26కు పెరిగింది. మొదటి లెక్కింపులో గెలుపుకు 42 ఓట్లురావాలి. అందువల్ల తెలుగుదేశం అభ్యర్థులు ఐదుగురూ తొలిలెక్కింపులోనే ఎన్నికైనారు.



-కొరవ 9వ పేజీలో

# నెల్లూరు జ్ఞాపకాలు - తప్పిపోయిన రాజకీయాలు

ప్రొఫెసర్ కె. శేషాద్రి

1942 లో ఆంధ్ర యూనివర్సిటీ గుంటూరుకి మార్చబడ్డది. యుద్ధ సమయంలో విశాఖపట్నంలో బాంబులు ప్రేలినందువల్ల తడికలతో గదులుకట్టి హాస్టల్ చేశారు. హిందూకాలేజిలో క్లాసులు పెట్టారు. శ్రీ విస్సా కృష్ణమూర్తి, నేను, పట్నం వీరాస్వామి కుమారుడు పద్మనాభయ్య అందరం అక్కడ బి. కాం. చదివేవారం. ఇంకా నలుగురైదుగురు నెల్లూరు విద్యార్థులు వుండేవాము. ఆగష్టు 9, గాంధీమహాత్ముని క్విట్ ఇండియా తీర్మానం; అది మరువరానిదినం, ఆయన ఉపన్యాసంకూడ చిరస్మరణీయం. దేశమంతా ఉడికిపోయింది. గుంటూరులో పెద్దగొడవ. ఐక మనపాత్ర వుండనేవుంది. పోలీసు కాల్పులు. ఇద్దరు బడిపిల్లల మరణం. కాలేజిలో కలవరం. చదువులు మానమని గాంధిమహాత్ముని పిలుపు; కొందరం, ఈ సందేశాన్ని విద్యార్థులలో ప్రచారితం చేయడానికి పూనుకున్నాము. నాకు కమ్యూనిస్టుపార్టీతో పరిచయం, సానుభూతి వున్నప్పటికి ఈ ఉద్యమం వచ్చేటప్పటికి, తెగతెంపులు చేసుకొన్నాను. మద్రాసునుండి ఎం.ఎస్.ఓ, లీడర్‌గావుండిన లతీఫ్ అఫ్గాని (వాయువ్య సరిహద్దు రాష్ట్రానికి చెందినవాడు) గుంటూరుకువచ్చి పార్టీ సానుభూతిపరుల నంతాకలిసి, పార్టీయొక్క వ్యతిరేకతను బోధించాడు. కాని ఫలితంలేదు. నన్ను, విస్సా కృష్ణమూర్తిని, ధర్మయ్య అనే ఇంకొక విద్యార్థిని, మరికొందరిని యూనివర్సిటీనుండి వెడలగించారు. "చదువుకోమంటే ఈపనిచేస్తావా? ఆగాంధీనే భిక్షపెట్టమను" అని మాతండ్రి డబ్బు పంపడం నిలిపివేశాడు. తాతగారిదగ్గరకు నెల్లూరికి వచ్చాను.

ఆంధ్ర కాంగ్రెస్ సర్క్యులర్ కందేశవ్యాప్తంగా పేరుపొందిన పత్రం పిలుపుఫలితంగా గుంటూరులో రెండు రైల్పు పట్టాలుతప్పినవి, తంతులు తెగినవి; నెల్లూరులో దొంగతనంగా నేను కృష్ణమూర్తి కరపత్రాలు అచ్చువేయించి నేడు ఏ. సి. పార్కుగావున్న మునిసిపల్‌పార్కులో రేడియోవార్తలుకాగానే వాటిని విసిరేవాళ్ళము. మామీద అరెస్టువారెంటు వస్తుందని కృష్ణరావు అనే పోలీసు ఇన్స్‌పెక్టర్ విస్సావారి స్నేహితుడైనందున మమ్మలను వారించి అజ్ఞాతవాసంలో పెట్టించాడు. పెనుబోలు వారింట్లో వుండేవాళ్ళం. తర్వాత కాంగ్రెస్ ఉద్యమం సన్నగిల్లినది, మరల నాకు కమ్యూనిస్టుపార్టీతో సంబంధం ఏర్పడినది. అప్పుడే నెల్లూరులోని పార్టీతో నాకు పరిచయం. జి. సి. కొండయ్యను చూచాను. అందరు అతన్నిగూర్చి చెప్పేవారు. "42 హీరోస్" అని కొండయ్య సుందరాజలు, దువ్వూరు శేషగిరిరావు మమ్మలను కొంత హేళనగా పిలిచేవారు. పార్టీ కార్యకలాపాలు చురుకుగా మొదలైనకాలం అది. నేను 1946 లోనే బి. ఎ. లో మరలచేరాను, నాలుగైదు సంవత్సరాల బ్రేక్ అనంతరం, అనంత రామయ్య నేను 42 కాంగ్రెస్ రౌడీ మూకలోనివాడిననిదూరంగావుండేవాడట

మీకు జ్ఞాపకం వుండవచ్చు: శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారు కోమల విలాస్ హోటల్ ప్రొప్రైటర్‌గా వున్నప్పుడు, నేను తెలంగాణా సాయుధపోరాటానికై హుండీలలో విరాళాలు ప్రోగు చేస్తున్నప్పుడు, కోదండరామరెడ్డిగారు హోటల్‌లో తినేవారికి ఆటంకంకల్గించవద్దని వాలెంటీర్లను బయటకుపంపారు. అంతటితో ఆ హోటల్‌పై బహిష్కరణ మొదలైనది. కొందరు ఈసాకు పెట్టుకొని ఆయనమీద కరపత్రాలు పంచారు. అందులో నాపేరు ఇరికించి ఆయన నన్ను అమర్యాదగా మాట్లాడాడని ఆరోపించి పెద్దఎత్తున బాయ్‌కాట్ చేయించారు. ఆయన తిప్పరాజువారి సత్రంలో సభపెట్టి తాను తెలంగాణా సాయుధ పోరాటానికి వ్యతిరేకిని కాదనిన్ని, తాను శేషాద్రిని ఏవిధంగాగూడ నిందించలేదనిన్ని, హోటల్‌లోమాత్రం చందా వసూలు చేయవద్దని వారించాననిచెప్పారు. నేను దానిలో జోక్యం కలుగజేసుకోలేదు. ఇదంతా నావిషయంకాబట్టి నేను జ్ఞాపకాలలో వ్రాయలేదు. ★





## పినాకిని తీరం

మల్లెమాల

### హస్తవాసి మంచిదా?

పునాదిరాళ్ళు, ప్రారంభోత్సవాలకు అనుబంధాలు, అభిమానాలేకాదు; హస్తవాసులు, అదృష్టవాసనలు కూడా అర్థమైన అంకాలే. వాటికేకాదు వ్యాపార సంస్థల నామకరణాలకుకూడా అంతే. దీన్ని గొడ్డెదాటు, వేలంవెర్రి అనడం పరుషంగావుంటుందికాని: అదొక మోజు సరదా అనుకుంటే సరిపోతుంది!

సాధారణంగా పునాదిరాళ్ళు, ప్రారంభోత్సవాల హక్కు భుక్తాలు అమాత్య వర్యులవి. అధికారంలో వుండేవారిని పిలిచి పూలమాలలతో ముంచి,గుణగానం చేసి, వారి'స్వర్ణహస్తాల'తో రిబ్బను కత్తిరింపో, రాయి వేయింపో చేస్తే ఏనాడైనా ఏమూలకంగానైనా ఫలితం వుంటుంది గాని, అధికారంలేని సాదా తోలుచేతుల్తో చేయిస్తే ఏమీ లాభం వుండదుగదా!

పేర్ల విషయానికొస్తే అధికలాభార్జనాపరులందరికి వెంకటేశ్వరస్వామి మీద భక్తిజాస్తి: ఆయన పేరుమీద గురి ఎక్కువ. అందువల్ల సినిమాహాళ్ల మొదలు సెలూన్ల వరకు ఆయన పేర్లే! పాపం, ఆయన మొగమోటి; ఎవ్వర్నీ కాదనలేడు!! నెల్లూరులో వ్యాపార విజయానికి 'నిర్మల'ను ఒక సంకేతం చేశాడు శ్రీ బండి కొండారెడ్డి పట్టిందంతా బంగారమన్నట్లు ఆపేరు పెట్టుకున్నవాళ్ళందరూ డబ్బు జవురుతున్నారని ఒక నమ్మకం; అందువల్ల బండి వారి సొంతంగావుండిన 'నిర్మల' అందరి సొత్తు అయిపోయిందిం అందరూతమ వ్యాపార సంస్థలకు ఆ పేరే పెట్టుకొంటున్నారు. ఇంత పాపులర్ అయిన పేరు నెల్లూరు వ్యాపారరంగంలో వెంకటేశ్వర తర్వాత నిర్మలయేనేమోనని పిస్తుంది. నమ్మకాలనేవి గుడ్డివేగదా!

అట్లనే ఇటీవల నెల్లూరులో ప్రారంభోత్సవాలకు అధికారేతరులలో సహజకవి, చిత్రనిర్మాత శ్రీ మల్లెమాల సుందర రామరెడ్డి పిలువబడుతున్నారు. మొన్న హోటల్ స్వాగత్ ప్రారంభోత్సవంకూడా ఆయన చేతిమీదుగానే జరిగింది. ఎక్కడో మద్రాసులో చిత్రరంగంలో వున్న మల్లెమాలను నెల్లూరు ప్రారంభోత్సవాలకు పిలవడంలోని విశేషమేమిటి? ఆయన హస్తవాసి మంచిదా? హృదయం మంచిదైతే హస్తమూమంచిదవుతుంది:ఆచేతితో చేసేపని సత్ఫలితాలనిస్తుంది. అందువల్ల మల్లెమాల మనసు మంచిదనుకోవాలి; ఆ హృదయ సౌందర్య, సౌగంధాలే నెల్లూరు వ్యాపారీయులను ఆకర్షిస్తున్నాయనుకోవాలి! అభిమానాలు, అవసరాలు వుంటే వుండవచ్చుననుకోండి- అది వేరే సంగతి!

మల్లెమాలలో ఏదోవిశేషం.ఆయనవ్యక్తిత్వంలో ఏదో విశిష్టత వుండాలి; లేకుంటే అనలే పొడగరి అయిన మల్లెమాల సినీరంగంలో అంత ఎత్తుకు ఎదిగివుండడు. ధనంతో పెద్దవాడయ్యాడా అంటే- ఆ రంగంలో అంతకంటే ధనాఢ్యులున్నారు; సహజకవేగాని - సినిమాకవిగా- ఆయన...

-కొరవ 11 వ పేజీలో

# జమీన్ రైతు

## అది 'సీమ' కాకూడదు!

ఇటీవల తెలుగు దినపత్రికలు రాయలసీమకు 'సీమ' అని ముద్దుపేరు పెట్టుకున్నాయి. పలుకు, వ్రాత, అచ్చు సౌలభ్యంకోసం ఈ విధంగా పేరును పొట్టిచేశాయో, లేక మరే ఇతర వుద్దేశ్యంతో నైనా ఈ విధంగా నామకరణం చేశాయో తెలియదు. విదేశాన్ని 'సీమ' అనడం మనకు అలవాటు. రాయలసీమను ఆ నాయకులు రాష్ట్ర ప్రజలకు ఒక 'సీమ'ను చేస్తున్నారనే ధ్వని ఈ పొట్టిపేరులో వుందా ?

పేరును పొట్టిచేయడంలో పత్రికల వుద్దేశ్యమేమిటో వూహించలేముగాని, రాయలసీమ నాయకుల ప్రసంగాలు, వైఖరులుమాత్రం అటువంటి వేర్పాటు వాతావరణాన్ని కల్గిస్తున్నాయని చెప్పకతప్పదు.

రాయలసీమ వెనుకబడి వున్నదనడంలో రెండు అభిప్రాయాలు లేవు. రాయలసీమగాని, తెలంగాణాగాని, లేక ఇతర జిల్లాలలోని అటువంటి ప్రదేశాల సర్వతోముఖాభివృద్ధికి ప్రాధాన్యత ఇవ్వబడాలని, ప్రత్యేకంగా నిధులు కేటాయింపబడాలనే దానిలో వివాదమే లేదు. కాని అటువంటి అభివృద్ధి కృషి ఆయాప్రదేశం వెనుకబడినతనం ఆధారంగా జరగాలిగాని, ప్రాంతీయ అధిక్యతలతో కాదు. ప్రాంతీయ వాదనలొస్తే అది ప్రమాదకరమైన వేర్పాటు ధోరణికి దారితీస్తుంది. వేర్పాటు ధోరణికాని, వుద్యమంకాని అభివృద్ధికి దోహదకరం కాకపోగా, మామూలు అభివృద్ధి కృషినికూడా కుంటుపరుస్తాయి.

ప్రాంతీయ తత్వాలు, వేర్పాటుధోరణులు రాజకీయ నాయకులు తమ స్వార్థప్రయోజనాల కోసం రెచ్చగొడుతున్నవేగాని, చిత్తశుద్ధితో ఆయాప్రాంతాల అభివృద్ధిని కాంక్షించి ప్రేరేపించేవికాదు. తమ ప్రాంత అభివృద్ధే తెలంగాణా నాయకుల లక్ష్యమై వుంటే వారు ప్రత్యేక తెలంగాణా వుద్యమాన్ని ఎందుకు నీరుగార్చి, సమైక్య రాష్ట్రనాయకత్వాన్ని స్వీకరించారు? తెలంగాణాతో తెగతెంపులు చేసుకోవడమే తమ వుద్యమ వుద్దేశ్యమై వుంటే జై ఆంధ్ర నాయకులు దానికి వెన్నుపోటు పొడిచి, వారితోటి కలసి అధికారాన్ని ఎట్లా పంచుకున్నారు? ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటినుండి నేటివరకు పదిమంది ముఖ్యమంత్రులు అధికారాన్ని చేపడితే ఆంధ్ర, రాయలసీమలకు చెందినవారు చెరి ముగ్గురు కాగా, తెలంగాణీయులు నల్గురు! ప్రాంతీయతమీదనే ఆయాప్రాంత అభివృద్ధి ఆధారపడివుంటే, రాయలసీమ, తెలంగాణాలు ఈపాటికెప్పుడో సర్కారుజిల్లాలను మించిపోయి వుండాలిగదా? అందువల్ల అభివృద్ధి కృషికి వెనుకబడినతనం ప్రాతిపదిక కావాలిగాని, ప్రాంతంకాదు!

తెలుగు గంగ విషయంలోకాని, ఇతర విషయాలలో కాని కొందరు రాయలసీమ నాయకుల వైఖరి, ఆందోళనాపద్ధతి చూస్తుంటే రాష్ట్రం మరో ఏర్పాటు వుద్యమాన్ని ఎదుర్కోవలసి వుంటుందా అనే భయసందేహాలు కలుగుతున్నాయి. తెలుగుదేశం ప్రభుత్వ అస్పష్ట విధానాలు వారిలో అపోహలు కల్గించి వుండవచ్చు; తిండి లేగాక, త్రాగునీటికికూడా వారు కటకట పడిపోతుండవచ్చు; తమ సమస్యల పరిష్కారానికి, బాధల నివారణకు అడగవచ్చు, ఆందోళనచేయవచ్చు; కాని వాటిమోతాదుప్రజలకు వేర్పాటుతత్వాన్ని ఒంటపట్టేదిగా వుండకూడదు; రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల వారికి రాయలసీమ ఒక 'సీమ' కాకూడదు! రాయల్సీమ శ్రేయస్సును, రాష్ట్ర సమైక్యతను వాంఛించేవారి ఈ ఆకాంక్షను రాయలసీమ కొత్తతరం నాయకత్వం వమ్ముచేయదనే ఆశిస్తాము.



# పరీక్షలకు మేము పనికిరామా?




విద్యాంసస్థలలో పనిచేసే బోధనేతర సిబ్బంది ప్రభుత్వపరీక్షల నిఘాబాధ్యత నిర్వహించడానికి పనికిరారా? వారికా అర్హతలేదా?

లెక్చరర్లు, టీచర్లు సమ్మెవల్ల ఇంటర్, పదవతరగతి పరీక్షల నిర్వహణకు ఎన్నిపాట్లు పడుతుంటేరి మనం చూస్తూనే వున్నాం. అయినా ప్రభుత్వం బోధనేతర సిబ్బంది సహకారం తీసుకోవడం లేదు.

మామూలు పరిస్థితులలోకూడా 10 తరగతి పరీక్షలు మార్చి 15 తేది తర్వాత జరుగుతాయి. అప్పటికి చాలమంది ఉపాధ్యాయులకు తాముచెప్పవలసిన సిలబస్ పూర్తికాదు. పరీక్షల నిఘా బాధ్యత వీరిపై పడడంతో పూర్తికాని

—తరువ 14 వ పేజీలో

## జమీన్ రైతు

20-3-1936

వెంకటగిరి ఎస్టేట్

ఆదాయంపై 2 లక్షలకు డిక్రి

వెంకటగిరి మహారాజాగారిమీద లేటు రాజా వేణుగోపాలకృష్ణయాచేంద్రులవారి అభిమాన స్త్రీ పుత్రులు(1) రాజా వి. రాజేశ్వరరావు (2)రాజా వి. మహేశ్వరరావుగారలు నెల్లూరు సబ్‌కోర్టు అసలు నెం. 30 ఆఫ్ 32 రువ 4-7-32 తేదిన అలవెన్సుకు దావాతెచ్చిరి.

నెల్లూరు సబ్‌జడ్జి శ్రీమాన్ ఎం. ఎస్. నరసింహాచారియార్ అవరగల్ గారు 18 తేది పగలు 11-15 గంటలనుండి 1-45 గంటలవరకు పై కేసులో జడ్జిమెంటు కోర్టుమీద చదివిరి. 122 పేజీలు టైపుడ్ జడ్జిమెంట్ వ్రాసిరి.

వాదులు లేటు రాజా వేణుగోపాల కృష్ణయాచేంద్రుల పుత్రులేనని యు,

—తరువ 14 వ పేజీలో

### 50 ఏళ్ల క్రితం ఈవారం

# ఆదాయం కోటి పెరిగినా అభివృద్ధి నీరసించింది!

నెల్లూరు మున్సిపల్ బడ్జెట్ ఐదు కోట్లు చేసింది. సెన్సస్ ప్రకారం నెల్లూరు జనాభా రెండు లక్షల 23 వేలు. ఈ బడ్జెట్‌లో ఐదు కోట్లు లను చేర్పించినా అర్థం కాదు. జనాభా, బడ్జెట్ పోల్చి చూస్తే ప్రతి నెల్లూరు పౌరుడిమీద మునిసిపాలిటీ, సగటు, ఏటాటికి రూ 165 లు ఖర్చు పెట్టునున్నట్లు. వ్యయంలో క్రమ శిక్షణ, సక్రమ వినియోగం పాటిస్తే ఇది తక్కువ మొత్తం కాదు.

86-87 సంవత్సరానికి కమీషనరు ప్రతిపాదించిన ఆదాయం అంచనా రు. 4,41,49,245లు: వ్యయం రు. 4,66,19,129: మిగులు రు. 24,58,052లు; వ్యయం.మిగులు కలిపితే రు. 4,90,77,152లు అంటే రమారమి ఐదుకోట్లు.

మునిసిపాలిటీ ఆదాయంలో పెద్ద పద్దు ఇంటి పన్నులది-రు. 1,17,85,691; తర్వాత స్థానం వినోదపు పన్ను-కోటి రూపాయలు; ఇతరత్రా పన్నులు 68 లక్షలట. ప్రభుత్వ గ్రాంట్లు, నష్ట పరిహారములు, డిపాజిట్లు తదితరాల ద్వారా తక్కిన ఆదాయం వస్తుందని అంచనా వేశారు.

మునిసిపాలిటీ ఆదాయం ఏటా కోటి రూపాయలవరకు పెరుగుతూంది. 1984-85 లో బడ్జెట్ అంచనాలు 3 కోట్లా 17 లక్షలైతే 85-86 లో అది 4 కోట్లా 10 లక్షలకు పెరిగింది: ఇప్పుడు 5 కోట్లకు చేసింది. విశేష మైన అభివృద్ధి ఇది.

అయితే ఆదాయం ఇంతపెరిగినా, అభివృద్ధి పనులకు కేటాయింపులుమాత్రం బాగా తగ్గిపోయాయి. గతఏడాది ఈ కార్య క్రమాలకు కోటి 37 లక్షల 90 వేలు కేటాయిస్తే ఈ ఏడాది దాన్ని కోటి 27 లక్షలకు తగ్గించారు. ఈ తిరోగమనం

### మునిసిపల్ బడ్జెట్

ఎందువల్ల సంభవించిందో కమిషనర్‌గారే చెప్పాలి.

మునిసిపాలిటీ ఆదాయంలో 59 శాతం సిబ్బందిజీతభత్యాలు, నిర్వహణఖర్చులకే సరిపోతున్నాయి అఫీసునుంచి లంగర్ ఖానాలవరకు వున్న వందలాదిమంది సిబ్బంది జీతాలకు కోటి 72 లక్షలా, 78 వేలు, వీటన్నింటి నిర్వహణకు కోటి 4 లక్షలా 14 వేలు వ్యయం చేస్తున్నారట. ఇందులో విద్యుత్ ఖర్చే రమారమి 80 లక్షలు.

అభివృద్ధి కార్యక్రమాలకు వ్యయం ఖాతాలో పెద్ద పద్దులు- డ్రైనేజి, నీటి సరఫరా. వీటికి 40 లక్షలు కేటాయించారు తర్వాత ప్రాధాన్యత కాలువలలో ఇంటర్నల్ రోడ్లకు ఇచ్చారు. వీటికి కేటాయింపు 15 లక్షలు.

వెనుకబడినతరగతులవారి ప్రాంతాలలో అభివృద్ధిపనులకు 12 లక్షలు: ఉన్నత పాఠశాల భవనాలకు 5 లక్షలు; కమ్యూనిటీహాల్సుకు 3 లక్షలు; టౌన్‌ప్లానింగ్ ఆఫీసర్ ఇంటికి అదా 50 వేలు; సెప్టిక్ లెట్రిన్లు, యూరినల్సుకు 3 లక్షలు; షెడ్యూలు తెగలవారి ప్రాంతాలలో అభివృద్ధిపనులకు 3 లక్షలా 50 వేలు; స్త్రీ శిశుసంక్షేమ కార్యక్రమాలకు 4 లక్షలు; రోళిఖానాలకు లక్ష; ట్రాక్టర్లు కొనడానికి 4 లక్షలు; కమీషనర్‌కు కొత్త కారు కొనుగోలుకు లక్ష; బస్టాండ్ అభివృద్ధికి 50 వేలు; మార్కెట్ కట్టడానికి 6 లక్షలా 50 వేలు కేటాయించారు.

లైట్లకు 2 లక్షలు, ప్రాథమిక పాఠశాలల భవన నిర్మాణానికి 5 లక్షలు; స్కూళ్ళలో ఫర్నిచర్‌కు 4 లక్షలు. ఆత్మకూరు బస్టాండు నుంచి నిర్మిస్తున్న బైపాస్‌రోడ్డుకు 5 లక్షలు, ఇందుకవసరమయ్యే భూసేకరణకు 5 లక్షలు, పాపు రూములు కట్టడానికి 5 లక్షలు కేటాయించారు.

ఎందువల్లనో ఈ ఏడాది బడ్జెట్ చాలా అసమగ్రంగా, నిరుత్సాహకరంగా వుంది.

—కొంవ 12 వ పేజీలో

# ప్రభుత్వాసుపత్రిని తలపింపజేస్తున్న అవోపా వైద్యశిబిరం

నెల్లూరు వైశ్యులలో సేవానురక్తిని పెంపొందింపజేస్తున్న సంస్థ అవోపా దశాబ్ది ఉత్సవాలు ఇటీవల పాండురంగ అన్నదాన సమాజంలో వేడుకగా జరిగాయి. నెల్లూరు వైశ్య ముఖ్యులేకాకుండా తిరుపతి మెడికల్ కాలేజి ప్రిన్సిపల్ డాక్టర్ కె. వి ఎ. సుందరం, ఆలిండియా వైశ్యసమాజ్ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. సి. గుప్త వంటి పొరుగుప్రాంత ప్రముఖులుకూడా వచ్చారు. శ్రీ అమరా సుబ్బారావు సభనధ్యక్షించారు.

అవోపా ప్రతి ఆదివారం నిర్వహిస్తున్న మెడికల్ క్యాంపు, పెద్ద ప్రభుత్వాసుపత్రివలెవుందని డాక్టర్ సుందరం పొగిడారు; వైశ్యులకు మహోజ్వలమైనచరిత్ర వుందని, ఇప్పటి వైశ్యులందరూ సమైక్యంచెందగలిగితే అంతటి భవిష్యత్తు కూడా వుండగలదని శ్రీ కె. సి. గుప్త అన్నారు.

ఈ సందర్భంగా విడుదలచేసిన సావనీరును జిల్లాజడ్జి శ్రీ ఐ. శివసాంబమూర్తి ఆవిష్కరించారు. శ్రీమతి శివసాంబమూర్తి క్రీడాపోటీలలో గెలుపొందినవారికి బహుమతులిచ్చారు. సంస్థ ప్రధానకార్యదర్శి శ్రీ పువ్వాడ నారాయణ, మెడికల్ సర్వీసు కమిటీ కన్వీనరు డాక్టర్ కె. సుబ్రహ్మణ్యం, మహిళావిభాగం కార్యదర్శి శ్రీమతి వి. మంజులవాణి నివేదికలు చదివారు. శ్రీ వి. మాధవరావు, శ్రీ బి. పాండురంగం సభ నిర్వహించారు. సావనీరు రూపొందించిన శ్రీ ఎ. చంద్రశేఖర రావు, శ్రీ బి. ఉదయభాస్కరరావులను మెమెంటోలతో సత్కరించారు. శ్రీ ఎం. సి. కళాధర్ వందనాలు చెప్పారు.

### జేసిస్ కవితల పోటీ

నెల్లూరు జేసిస్ క్లబ్ ఏప్రెల్ 10తేది ఉగాది కవితల పోటీ నిర్వహిస్తుంది. బహుమతులు నగదు రూపంలో వుంటాయని, క్లబ్ అధ్యక్షుడు శ్రీ జి. రాధాకృష్ణ తెలియజేస్తున్నారు. వివరాలకు-

### నెల్లూరు సంగతులు

జేసిస్ అధ్యక్షుడు, స్టాండర్డ్ ప్యాకేజింగ్స్ ఇండస్ట్రియల్ ఎస్టేట్, నెల్లూరు-4 చిరునామాకు వ్రాయండి.

### స్వామిదాస్ స్కూల్ 16 వార్షికోత్సవం

మునిసిపల్ స్కూళ్ళకంటే అధికసంఖ్యలో విద్యార్థులతో నడుస్తున్న స్వామిదాసు ఇంగ్లిషుమీడియం హైస్కూలు 16 వార్షికోత్సవం ఇటీవలజరిగింది. శ్రీ దేవిరెడ్డి కోదండరామరెడ్డి అధ్యక్షించారు. శ్రీ పి.సి.రెడ్డి ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. ప్రధానోపాధ్యాయురాలు శ్రీమతి గ్రేస్

—కొంవ 14 వ పేజీలో

# ప్రభుత్వాలు నిర్లక్ష్యం చేస్తే న్యాయస్థానాలే సంఘ సంస్కర్తలౌతాయి!

భారత న్యాయశాస్త్ర చరిత్రలోనే సంచలనం సృష్టించిన షాబానుబేగం, ఇండోరుకు చెందిన ముస్లిం స్త్రీరాలు. ఆమెకు మహమ్మద్ అహమ్మద్‌ఖాన్ అనే న్యాయవాదితో 1932లో వివాహమైంది. దాదాపు నాలుగు దశాబ్దాల వైవాహిక జీవితం తర్వాత, 1975లో షాబానుబేగంను ఆమె భర్త ఇంటినుండి తరిమివేశారు. ఈ జంటకు ఐదుగురు సంతానంకూడా వున్నారు- ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు.

మూడు సంవత్సరాల విరామం తర్వాత, 1978లో షాబాను తనకు నెలకు రు. 500ల భరణం కావాలని కోరుతూ, ఇండోర్ మేజిస్ట్రేట్ దగ్గర పిటిషన్ దాఖలుచేసింది. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 125 సెక్షన్ క్రింద ఈ పిటిషన్ దాఖలైంది. తర్వాత భర్త ఆమెకు విడాకులిచ్చారు.

అహమ్మద్ ఖాన్ ఈ పిటిషన్‌ను తీవ్రంగా వ్యతిరేకించారు. షాబానుకు తాను విడాకులిచ్చాను కాబట్టి, ఆమె తన భార్య కాదని, ఆమెకు తాను భరణం ఇవ్వవలసిన అవసరంలేదని వాదించారాయన. అయితే మేజిస్ట్రేట్ ఈ వాదనను త్రోసిపుచ్చి, ఆమెకు నెలకు రు. 25ల భరణం ఇప్పించారు; తర్వాత ఆమె భరణం చాలదంటూ మధ్యప్రదేశ్ హైకోర్టుకు అప్పీలుచేసింది. వారు దీనిని రు. 179-20లకు పెంచారు. వెంటనే అహమ్మద్‌ఖాన్ సుప్రీంకోర్టు శరణుజొచ్చారు. ఆ అత్యున్నత న్యాయస్థానం ఆతని అప్పీలును తిరస్కరించి, హైకోర్టు తీర్పును ఖాయపరచింది. అదే ఈరోజు దేశంలోని కోట్లాది ముస్లింలలో కలవరం సృష్టిస్తున్న షాబాను కేసు.

ఈ కేసు మొదటినుంచి చివరివరకు నడిచింది, ప్రొసీజర్ కోడ్ 125, 127 సెక్షన్ల ఆధారంగానే! 125 సెక్షన్ ప్రకారం, భార్యను పోషించటానికి శక్తి వున్నవ్యక్తి అందుకు నిరాకరించినా,

**షాబాను కేసు : ఒక పరిశీలన**

★

**శ్రీ పి. వి. రమణారెడ్డి**

తాత్సారంచేసినా, ఆ వ్యక్తి తన భార్యకు నెలకు రూ 500ల వరకు భరణం ఇప్పించే అధికారం ఒకటవతరగతి మేజిస్ట్రేట్‌కు వుంటుంది. విడాకులిచ్చిన భార్య సైతం, ఆమె తిరిగి పునర్వివాహం చేసుకొనేవరకు భార్యగానే పరిగణింపబడుతుందని ఈ సెక్షన్‌లో నిర్వచించారు. అయితే ఆచారంప్రకారం కానీ, మహమ్మదీయ న్యాయశాస్త్రం అనుసరించికాని విడాకులిచ్చినందుకు ప్రతిఫలంగా ఇవ్వవలసిన మొత్తాన్ని భర్త, భార్యకు చెల్లించినపక్షంలో 127 సెక్షన్ క్రింద మంజూరుచేసిన భరణం ఉత్తర్వును మేజిస్ట్రేట్ రద్దుచేయవలసి వుంటుంది.

ఈ ఆఖరి వాదననే అహమ్మద్‌ఖాన్ తరఫున సుప్రీంకోర్టులో వినిపించారు. కోర్టుమాత్రం దీనిని అంగీకరించలేదు. తమదృష్టిలో ఈ విషయానికి సంబంధించి ఎటువంటి వాదనకు అనుమానానికి తావులేదని, భార్యాభర్తలు ఏ మతస్థులన్న మీమాంస అప్రస్తుతమని, హైందవులైనా, ముస్లింలైనా, క్రైస్తవులైనా-భర్తకు భార్యను పోషించే శక్తి వుందా? భార్యకు తనను తాను పోషించుకునే శక్తి వుందా అన్నవిమాత్రమే విచారించదగిన విషయాలని న్యాయమూర్తులు స్పష్టంచేశారు.

భరణం హక్కు సివిల్ శాసనంలో కాకుండా, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో పొందుపరచి వుండటం ఇక్కడ గమనార్హం. క్రిమినల్ న్యాయశాస్త్రాలకు వ్యక్తుల మతాలతో సంబంధంలేదు. ఏ బేధాలతో నిమిత్తంలేకుండా దేశపౌరులందరికీ అవి సమంగా వర్తిస్తాయి. అందువల్లే సుప్రీంకోర్టు 125 సెక్షన్ మహమ్మదీయులకు కూడా వర్తిస్తుందని స్పష్టంచేసింది. ఈ కేసు ఒక్కటేకాదు-1979, 1980 లలో కూడా ఇటువంటి సుప్రీంకోర్టు తీర్పులు వెలువడివున్నాయి.

125 సెక్షన్‌కు, మహమ్మదీయ న్యాయశాస్త్రానికి మధ్య వైరుధ్యం ఏదైనా వుందా అన్నవిషయంకూడా సుప్రీంకోర్టు చర్చించింది. మహమ్మదీయ న్యాయశాస్త్రంప్రకారం భర్త విడాకులిచ్చిన భార్యకు 'ఇద్దత్' కాలంవరకు భరణం ఇవ్వవలసివుంటుంది. 'ఇద్దత్ కాలం' అంటే-విడాకులిచ్చేనాటికి భార్య గర్భవతి అయితే ప్రసవంవరకు, మామూలు పరిస్థితులలో 3 నెలలు. ఇద్దత్ అంటే నిషేధకాలం. ఆకాలంలో భార్య బ్రహ్మచర్యం అవలంబించాలి; పునర్వివాహంచేసుకోకూడదు.

సుప్రీంకోర్టు దీనిని సాధారణపరిస్థితులలోనే అమలుచేయవలసిన పద్ధతిగా భావించింది. విడాకులిచ్చిన భార్య తన్ను తాను పోషించుకోలేని పరిస్థితికి ఈ సిద్ధాంతం వర్తించదని, మహమ్మదీయ న్యాయశాస్త్రంలోకూడా ఎక్కడా అటువంటి పరిస్థితులలో ఇద్దత్‌కాలంతర్వాత భార్యను పోషించవలసిన అవసరంలేదని ఎక్కడా చెప్పలేదని అందువల్ల క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్‌లోని 125సెక్షన్‌కు, ముస్లిం న్యాయశాస్త్రానికిమధ్య ఎక్కడా వైరుధ్యం లేదని తీర్మానించారు.



మన సెక్యులరిజానికి ఒక సవాల్ విసిరిన షాబానుబేగం

వైరుధ్యం లేకపోవడమేకాదు, వారి న్యాయశాస్త్రం ప్రకారంకూడా విడాకులు తీసుకున్న భార్య పేదరికంలో వుంటే, ఆమెను పోషించవలసిన బాధ్యత భర్తపైనే వుంటుంది. ముస్లిం న్యాయశాస్త్రానికి మూలాధారం 'ఖురాన్'; ఇందులోని 241 అయాత్ ప్రకారం విడాకులిచ్చిన భార్యకు ఆమె జీవితకాలం న్యాయమైన భరణం ఇవ్వవలసిన బాధ్యత భర్తపై వుంది. ఖురాన్‌పై పలువురు మేధావులు ప్రచురించిన వ్యాఖ్యానాలను పరిశీలించి ఈ రకంగా తీర్మానించారు. అయితే, భార్య తిరిగి పునర్వివాహం చేసుకునేంతవరకు భర్త బాధ్యత.

—కొరవ 14వ పేజీలో

# ధాన్యం కొనుగోలు కేంద్రాలు దండగే!

'రైస్‌ఫెడ్' ఆధ్వర్యంలో జిల్లాలో 15 తేది తెరువబడిన ఎనిమిది ధాన్యం కొనుగోలు కేంద్రాలలో శుక్రవారం (19 తేది) వరకు ఒక్కగింజ కొనుగోలు జరగ లేదు. రైతులు కాంపిల్సు తేవటం, అయా కాంపిల్స్‌కు 'రైస్‌ఫెడ్' ఇవ్వజూపినధర అర్థాన్నం కావడంతో గుడ్డ విదిలించుకొని తిరిగిపోవడం జరిగింది. దీంతో 18 తేది నెల్లూరువచ్చిన రైస్‌ఫెడ్ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ సంజీవరావు ఆయా రకాలకు కొత్తధరలు ప్రకటించారు. కొత్తధరలు పాతవాటికంటే మేలేఅయినా మార్కెట్ ధరలతో పోల్చితే తక్కువే. 'రైస్‌ఫెడ్' వారి పాత, కొత్తధరలు: ఆయారకాలకు మార్కెట్‌లోవున్నధర దిగువ ఇస్తున్నాము. ఓపెన్ మార్కెట్‌లో కొనుగోలు చురుగ్గా లేదుకాబట్టి ప్రాణానికొచ్చిన రైతు రైస్‌ఫెడ్ కేంద్రాలలో తెగనమ్ముకునే అవకాశముందికాని, వాళ్ళ రూల్సు గీల్సు దానికి ఎంతవరకు దోహదకరమో సందేహమే! ముందు ధరలు పరిశీలించండి-

'రైస్‌ఫెడ్' వాళ్ళు కొత్తగా నిర్ణయించిన ధరలకు ధారాళంగా కొన్నా పచ్చిగింజపడిన ధాన్యంకలిపిన రైతుకు కొంత వరకు వెసలుబాటుగానే వుంటుంది. కాని వారి కొనుగోలుకు వారి నిబంధనలే ప్రతిబంధకం. కాంపిల్సు చూపించాలి, కేంద్రం వారు 'ఓకే' చేసి ధరనిర్ణయించాలి; ఆ ధర రైతుకు అంగీకారం కావాలి; ఆ పిమ్మట గోతాలు, గీతాలు, పురికొన గిరికొన తీసుకపోయి, తమ మనుషుల చేత కొలిపించి, కుట్టించి, లారీమాట్లాడి తమఖర్చులతో కొనుగోలు కేంద్రానికి చేర్చాలి. ఈ తతంగమంతా అయిపోయినతర్వాత సమయానికి సంబంధిత అధికారివుంటే సంతకంపెడితే డబ్బు యిస్తారు; లేకుంటే పైసలకోసం రేపు మాపుఅంటూ తిరగాలి. మిల్లర్లకు తన యింటివద్ద వారి ఖర్చుతో వారి శ్రమతో అమ్ముకుంటుండిన రైతుకు ఇది పెద్ద ప్రతిబంధకం కాదంటారా?

అంతేకాదు, కొల్తమొదలు, రవాణా వరకు రైతు భరించవలసివస్తే, మొదటే తక్కువగావున్న ధరలో అతనికి మిగిలేదెంత? ఈ రెండూకాకుండా, మరోపెద్ద అననుకూలత వుంది. 'రైస్‌ఫెడ్' ప్రకటించినధర అవసరంకొద్దీ తెగనమ్ముకోదలచిన రైతుకు పరవాలేదనుకున్నా, కాంపిల్సు తీసుకపోయినతర్వాత ఆ ధరే వస్తుందనే నమ్మకమేముంది? ఏవిధంగా చూచినా రైతన్న నెత్తిన కొల్లాయి పెడుతున్నామని లోకాన్ని మభ్యపరచడానికి తప్ప, ఈ కొనుగోలు కేంద్రాలవల్ల రైతుకు మేలు చేకూరుతుందని అనుకోలేము. కాని వ్యాపారుల కొనుగోలు మందంగా వుందికాబట్టి, మార్కెట్‌లో కొంత గిరాకి కల్గించడానికి ఈ కేంద్రాలు కొంతవరకు వుపయోగపడితే పడవచ్చు. అంతవరకే! ఆశలేదనుకోండి; అయినా ఒకవారం పదిరోజుల్లో వ్యవధినిచ్చి ఈ కేంద్రాల పనితీరును మరొకసారి పరిశీలించుకుందాం.

ప్రభుత్వ కొనుగోలుకేంద్రాల పరిస్థితి

—కొరవ 9 వ పేజీలో

| రకం | రైస్‌ఫెడ్ ధరలు | | మార్కెట్ ధర |
|---|---|---|---|
| | పాతధర | కొత్తధర | |
| మంచిధాన్యం పుట్టి | రూ. 1280 | రూ. 1348 | రూ. 1350 |
| 10 శాతం పచ్చగింజ | 1133 | 1280 | 1300 |
| 10 నుండి 20 శాతం | 1088 | 1190 | 1200 |
| 20 నుండి 30 శాతం | 1054 | 1099 | 1150 |
| 30 నుండి 40 శాతం | 895 | 997 | 1150 |
| 40 నుండి 50 శాతం | 884 | 940 | 1050 |

'రైస్‌ఫెడ్'
కొత్తధరలు-
ఒక్కగింజ
కొనుగోలు
జరగలేదు!

# కుప్పల దహనం కాదు- రైతు గుండెల మంట!

కోవూరు తాలూకా దంపూరులో చెన్నారెడ్డి చంద్రశేఖరరెడ్డి, వెంకారెడ్డిగారలకు చెందిన 30 ఎకరాల మొలగొలుకు కుప్పలు మూడు 14 తేది రాత్రి దహనమై పోయ్యాయి. ఒక్కగింజ ధాన్యంగాని, ఒక్కపోచ గడ్డిగాని మిగలలేదని తెలుస్తున్నది. నష్టం ఎనభైవేల రూపాయలు వుండవచ్చునని అంచనా.

ఈ రైతుల ఇల్లు అహిలంలోనే వున్నదట. ఇంటికి కుప్పలకుమధ్య 15 ఎకరాల చెలకు వున్నందువల్ల తాము కుప్పల దహనం విషయం వెంటనే తెలిసికొనే అవకాశం లేకుండాపోయిందని చంద్రశేఖరరెడ్డి చెప్పాడు. దహన కార్యక్రమం రాత్రి 10 గంటల సమయంలో జరిగింది. నెల్లూరు ఫైర్‌సర్వీస్‌కు ఫోన్ చేస్తే అగ్నిమాపకదళం అక్కడకు చేరేసరికి రాత్రి వొంటిగంట అయిందట. అవి వచ్చేలోగా అగ్నిదేవుడు తనపని పూర్తిచేసికొన్నాడు. ఈ మూడుకుప్పల ప్రక్కనేవుండిన ఇతర రైతులకుచెందిన మరో నాలుగుకుప్పలు ఈ ప్రమాదాన్ని తప్పించుకున్నాయట. కుప్పల నిప్పుతో చెరకు అంటుకోకపోవడం దురదృష్టంలో అదృష్టం అంటున్నాడు చంద్రశేఖరరెడ్డి.

## జిల్లావార్తలు

ఇది ప్రమాదవశాత్తు జరిగిన దహనంగా కనపడడంలేదంటారు. మూడు కుప్పలనుండి అక్కడక్కడ పన లాగివేసి ఆ తోపులలో నిప్పు పెట్టబడటాన్నిబట్టి వుద్దేశపూర్వకంగా తగులపెట్టబడినవని భావిస్తున్నారు. అయితే ఎవరు, ఎందుకు చేశారు అనేది చెప్పలేకుండావున్నారు. పోలీస్ లోతుగా దర్యాప్తు జరపగలిగితే గాని ఇవి బయటపడే అవకాశంలేదు. 15 తేది రిపోర్టుయిస్తే 16 తేది విడవలూరు ఎస్. ఐ. శ్రీ నరసింహరాజు ప్రమాద

—కొరవ 41వ పేజీలో

# నెల్లూరు నలుచెరగుల్లో

విమర్శకుడు

## డాక్టర్ ఎస్. ఎస్. రెడ్డి

ప్రముఖ సర్జన్ డాక్టర్ పన్నపనేని శ్రీనివాసులురెడ్డిగారికి 1985 సంవత్సరపు డాక్టర్ బి. సి. రాయ్ అవార్డు లభించింది. ఈ అవార్డుక్రింద యాభై వేల రూపాయల రొక్కం, ప్రతిభకు గుర్తింపుగా పత్రం ఇవ్వబడతాయి.

డాక్టర్ శ్రీనివాసులురెడ్డి నెల్లూరీయుడు. విశాఖ కింగ్ జార్జి హాస్పిటల్, హైదరాబాదు ఉస్మానియా ఆస్పత్రి సూపరింటెండెంటుగా పనిచేసి, వ్యక్తిలో దేశాన్ని ఆరాధించినవ్యక్తి. ఒకేసారి అంతర్జాతీయ వైద్యమహాసభలో పాల్గొన్న అనుభవశాలి.

డాక్టర్ శ్రీనివాసులురెడ్డిగారికి మా అభినందనలు.

## పెద్దాస్పత్రికి కొత్త సూపరింటెండెంట్

నెల్లూరు పెద్దాస్పత్రికి డాక్టర్ గురుదేవి సూపరింటెండెంట్‌గా నియమితులైనారు; అవినీతినిరోధకశాఖాధికారుల వలలో చిక్కిన యానాదినాయుడుగారిని సస్పెండ్ చేశారట.

## లెక్చరర్ల సమ్మె

లెక్చరర్ల సమ్మె ఒకవైపు, ఇంటర్ పరీక్షలు ఇంకొకవైపు నిరాటంకంగా జరిగిపోతున్నాయి. 19 తేదీ జూనియర్ ఇంటర్మీడియెట్ పరీక్షలు జరగనివ్వకుండా చేయడానికి లెక్చరర్లు ప్రయత్నించారుకాని, పోలీసులు రంగప్రవేశంచేసి, అరెస్టులతో దాన్ని విఫలంచేశారు. నెల్లూరు, కావలి తదితర ప్రదేశాలన్నింటిలో కలిసి దాదాపు 70 మందిని అరెస్టు చేశారు. నెల్లూరులో వెంటనే వదిలేశారు కాని, కావలిలో అరెస్టయినవారిని రిమాండుకు పంపారట. రెండవరోజునుంచి పరీక్షలకు ఎటువంటి అంతరాయంలేదు. విద్యాలయాలతో ఏసంబంధమూలేని ప్రభుత్వోద్యోగుల నిర్వహణ కావటంవల్ల, కాపీలుకొట్టేవారిపంట పండిందని లెక్చరర్లు ఆరోపిస్తున్నారు.

సమ్మె ఉధృతి కార్యక్రమంలో భాగంగా 21 తేదీ ఉదయం గాంధీ బొమ్మదగ్గర 125 మంది లెక్చరర్లు సామూహిక నిరాహారదీక్ష చేశారు. ఇందులో 20 మంది మహిళాలెక్చరర్లు.

## బంగారు స్మగ్లర్లు

ఎంతవరకు నిజమోకాని నెల్లూరు టౌన్, బంగారు స్మగ్లింగ్‌కు కేంద్రంగా మారుతూందని చెప్తున్నారు. మండపాల వీధి మరొక బర్మాబజార్‌గా కన్పిస్తూంది.

మొన్నొకరోజు సెంట్రల్ ఎక్సైజ్ అధికారులు చిన్నబజారు బంగారంగళ్ళపై దాడులు జరిపారు. అధికారులేమీ చెప్పలేదుకాని, ఈ దాడులలో దొరికిన బంగారం కిలోలలోవుందట. విదేశీ ముద్రలుకలిగిన బిస్కెట్లు, అపరంజి కూడా దొరికాయట.

చిన్నబజారు బంగారంగళ్లలో అత్యంత సుప్రసిద్ధము, అతిపురాతనము అయిన ఒక వైశ్యుని అంగడిలోనే 7 లక్షలకుపైగా విలువైన దొంగసరకు దొరికిందట.

అంతకుముందురోజు అధికారులు రాజస్థానుకుచెందిన ఒక మార్వాడిని ఆత్మకూరు బస్టాండులో అరెస్టు చేసి, పెద్దమొత్తంలో బంగారు బిస్కెట్లు స్వాధీనం చేసుకున్నారు.

## వి. ఆర్. కాలేజి ఎన్నికలు ప్రారంభం

వి. ఆర్. కాలేజి కమిటీకి ఐదుగురు ప్రతినిధుల ఎన్నిక కార్యక్రమం ప్రారంభమైంది. నామినేషన్ల ఉపసంహరణలతర్వాత నికరంగా నలుగురు అభ్యర్థులు మిగిలారు. ఆనంవారి తరఫున శ్రీ వివేకానందరెడ్డి, శ్రీ తూపిలి సుందరరామరెడ్డి; బి.జె.పి. పక్షాన శ్రీ పల్నాటి రామచంద్రారెడ్డి, పి. విద్యాధరరెడ్డి; ఆనంవారిపై తిరుగుబాటుగా నామినేషన్లువేసిన ఎ.వి.కృష్ణారెడ్యాదులు సైగ్గావిత్‌డ్రాచేసుకున్నారు; కారణమేమోమరి!

ఏప్రెల్ 19 తేదీ వరకు బ్యాలెట్ పత్రాలు స్వీకరిస్తారట; ఓట్ల లెక్కింపు ఆరోజే సాయంత్రం జరుగుతుంది. విజేతలెవరనే ఉత్కంఠ అవసరంలేదు- మొదటి ఇద్దరే!

## దరఖాస్తులు మర్చిపోయారట

వి. ఆర్. కాలేజికి వయసుతోపాటు, అసమర్థత అనే రుగ్మతకూడా పెరిగిపోతూంది.

రేపు ఏప్రెల్‌లో పరీక్షలకు హాజరు కావలసిన 3 వ సంవత్సరం డిగ్రీవిద్యార్థులకుచెందిన 150 పరీక్షల దరఖాస్తులు యూనివర్శిటీకి పంపడం మర్చిపోయారట. కాలేజి సిబ్బంది గడువు మీరినతర్వాత కలదెలుసుకొని, తత్తరపాటుతో తిరుపతికి పరుగెత్తిపోతే, వారు ససేమిరా వాటిని తీసుకోమన్నారట. తర్వాత ఎవరికాళ్ళు పట్టుకున్నారోగాని, పంపించి, చేర్పించివచ్చారట.

కాలేజి పాలనలో అరాచకం, అలక్ష్యం ఎంత పెరిగిపోతుంటే, ఇంత మరుపువస్తుంది సిబ్బందికి? శిథిలగృహంలావున్న కాలేజికి పునరుజ్జీవం కల్పించేవారులేరా?

## కొత్త సబ్‌స్టేషన్లు

జిల్లాలో ఏడుచోట్ల కొత్తగా 33 కి.వా. సబ్‌స్టేషన్లు నెలకొల్పడానికి విద్యుత్‌బోర్డు అంగీకరించిందట - రెవిన్యూమంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి చెప్పారు. వీటిలో ఆత్మకూరు సబ్‌స్టేషన్ పని ప్రారంభమైంది - దామరమడుగు, ఇనమడుగు, అరిమేనిపాడు, సిద్ధీపురం, జాలిరెడ్డిపాళెం, చెర్లోపల్లిలలో త్వరలో నిర్మాణం మొదలుపెడ్తారు.

## కాకుపల్లె రేప్- నిందితుడికి దేహశుద్ధి

చింతారెడ్డిపాళెం రోడ్డులోని గుర్రాలమడుగుకుచెందిన ఒక యువతిని, ముత్తుకూరు రోడ్డులోని కాకుపల్లెదగ్గర 18 తేదీ సాయంత్రం యిద్దరు యువకులు మానభంగం చేశారట. రామిశెట్టి ప్రతాప్, దగ్గుపాటి సుబ్రహ్మణ్యం అనే ఈ ఇద్దరూ చిల్లర రౌడీలట. కల్లుకోసం కాకోలుపోయి సైకిల్‌పైవస్తూ, కూలిపనినుంచి తిరిగి వస్తున్న ఆ యువతిని అడ్డగించి, పొలాల్లోకి లాక్కునిపోయి చెరిచారట.

మరునాటిరోజే కొందరు గ్రామస్తులు ప్రతాప్‌ను పట్టుకొని చితకదన్నారట; పోలీసులతడ్ని ఆస్పత్రిలో చేర్పించి, అరెస్టుచేశారు. సి. ఐ. శ్రీ భూపాల్‌సింగ్ కేసు దర్యాప్తు చేస్తున్నారు.

## 40 రూపాయల కోసం హత్య

నారాయణరెడ్డిపేటకు చెందిన కేమ

—కొరవ 9వ పేజీలో

## అదురుదెబ్బ

(మొదటిపేజి కొరవ)

సంతవల్కొండలో రా జ శే ఖ ర రె డ్డి మూడవలెక్కింపులో చౌదరి ఎగిరిపోగా, అనివార్య వి జ యం నా య క్ ను వరించింది!

చౌదరికి వచ్చిన 23 ఓట్లలో ఎవరి వెన్ను అంటే ఖచ్చితంగా చెప్పలేము; బి.జె.పి. వారివి 8 నికరం; మిగిలిన 15 కాంగ్రెస్‌వి అయివుంటాలి; కాని కాంగ్రెస్ బలం 50 కాగా అందులో ఆ పార్టీ అభ్యర్థి నాయక్‌కు 41 వచ్చాయి; లెక్కప్రకారం చౌదరికి 'క్రాస్' అయిన కాంగ్రెస్ ఓట్లు తొమ్మిదే కావాలి. ఎవరి వైతేనేమి పైగా చౌదరి చేతిలోకి చేరినవి 15 అని చెప్పుకుంటే సరిపోతుంది!

తెలుగుదేశం విజయోత్సవాలు జరుపుకుంటుంటే, కాంగ్రెస్ 'ముద్దాయిల' మీద చార్జిషీటు తయారీ కార్యక్రమంలో నిమగ్నమై వున్నట్లుంది. విద్రోహచర్యకు పాల్పడిన వారంటూ పన్నెండుమంది పేర్లను పిసిసి ప్రెసిడెంటు శ్రీ వెంగళరావు ఎ.ఐ.సి.సి. సెక్రెటరీ భగవత్‌ఝా ఆజాద్‌కు సమర్పించారని వదంతి. వీరందరినీ కాంగ్రెస్ నుండి తొలగించి, పార్టీని మరీ బలహీనపరచడం మంచిదా? అందరినీ కలుపుకొని భవిష్యత్తులోనైనా ఇట్లా జరగకుండా చర్యలు తీసుకుంటూ, పార్టీని సంఘటిత పరచుకోవడం వివేకమా? కాంగ్రెస్ నాయకుల సమయజ్ఞతకు ఇది ఒక సవాల్ అని పరిశీలకులు భావిస్తున్నారు. ★

## జిల్లా వార్తలు

(7 వ పేజీ కొరవ)

స్థలానికివచ్చి చూచిపోయారట. ఇంత ఘోరకృత్యం జరిగితే కావలి డి.ఎస్.పి. గాని, కోవూరు సర్కిల్ ఇన్‌స్పెక్టరుగాని ఆ గ్రా మా ని కే పోయినట్లులేదు. ఈ ప్రమాదం విషయం ఎస్.పి. ఇన్‌చార్జితో వున్న గుంటూరు డి. ఐ. జి. శ్రీ రామస్వామి దృష్టికి పోయినట్లుంది. 19 వతేది సాయంత్రం వరకు ఈ సందర్భంగా అరెస్టులు గిరెస్టులు ఏమీ జరిగినట్లులేదు.

పల్లెల్లో రైతు వుండలేని వాతావరణం, వ్యవసాయం చే య లే ని పరిస్థితి రోజు రోజుకు ఎక్కువైపోతున్నది. భూదేవిని నమ్ముకున్నవాడు చెడిపోడనే సామెతకు కాలదోషంపట్టింది; భూమిని నమ్ముకున్నవాడు బ్రతకలేడనే వాస్తవం దృఢపడుతున్నది. దంపూరువంటి సంఘటనలు రైతులలో మరింత నైరాశ్యాన్ని కల్గించగలవు.

ఆరునెలల తమ వ్యయప్రయాసను అరగంటలో అగ్నికి ఆహుతిగొంటే చెన్నారెడ్డి చంద్రశేఖరరెడ్డి వంటి రైతులు కోలుకునేదేంటి? అందుకే అది పంటల దహనంకాదు. ఆ రైతుల గుండెలమంటలు అనవలసివస్తున్నది. ★

(8 వ పేజి కొరవ)

లమ్మ అనే వృద్ధురాలిని అదే గ్రామానికి చెందిన ఇద్దరు యువకులు కొట్టి చంపి ఆమె దగ్గరున్న 40 రూపాయల డబ్బు పెరుక్కొనిపోయారట. రూ ర ల్ సి ఐ శ్రీ భూపాల్‌సింగ్ మెళకువగా వ్యవహరించి వీరిద్దరినీ అరెస్టు చేశారు.

ప్రా ణం వి లు వ ఎంత నలిసై పోయిందండి?

## నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 19. 4 అ. |
| సర్వేపల్లి ,, | 8. 9 అ. |
| నెల్లూరు చెరువు | 15. 8 అ. |

## నెల్లూరు బజారు

మొలగొలుకు (9672)

| | | |
|---|---|---|
| ,, | పాతవి | 1800-00 |
| ,, | కొత్తవి | 1325-00 |



మద్రాసు స్మాల్ కాజస్ కోర్టులో

U. C. S. C. No. 2021/84

ఎ. రాధాకృష్ణ —వాది

పిగిలి సుబ్బమ్మ మరియు ఇతరులు —ప్రతివాదులు

To:

1. పిగిలి సుబ్బమ్మ W/o. పిగిలి కొండయ్య, నరసింగోలు, 2. గండు పెద్ద కొండయ్య, గుడూరు 3. గండు చిన్న కొండయ్య, నరసింగోలు అనువారికి

ఇందువలన ప్రతివాదులకు తెలియ చేయడమేమనగా వాదికి మీవలన రావల సిన మొత్తము రు. 1693/- మరియు ఖర్చులు రాబట్టుకొనుటకు order 37 Rule 2 of S. C. Rules ప్రకారం 3వ స్మాల్ కాజస్ కోర్టు, మద్రాసు నందు 25-3-86 తేది ఉ. 10-30 గంటలకు వాయిదా వేయబడినది ఆరోజు మీరు హైకోర్టులో మీ ఆక్షేపణలు తెలుపుకో వలెను. లేనియెడల మీ పరోక్షమందు తీర్మానించబడును.

—బి. స్కందకుమార్
వాది తరఫు అడ్వకేటు.



## శ్రీ మహాలక్ష్మి నూతన విగ్రహ ప్రతిష్ఠ ఆహ్వానము

స్వ. స్తి. శ్రీ క్రోధననామ సంవత్సరం ఫాల్గుణ శు॥ లు బుధవారం 19-3-86 తేది ప్రారంభం 21-3-86 తేది వరకు అనగా ఫాల్గుణ శుద్ధ ౧౦ లు శుక్రవారం పుష్య నక్షత్ర యుక్త శుభ దినమువరకు త్రిరాత్రి దీక్షతో పరాశరోక్త వైదికాగమరీతిగా నెల్లూరుఉప్పుల నవాబుపేట నరసింహాశెట్టి వీధిలో అనాదిగ నుండిన శ్రీ మహాలక్ష్మి దేవాలయమును జీర్ణోద్ధరణముచేసి శ్రీ శ్రీ శ్రీ మహాలక్ష్మమ్మ నూతన విగ్రహ ప్రతిష్ఠ జరుగును. భక్తులు విచ్చేసి శ్రీ మహాలక్ష్మమ్మవారి అనుగ్రహమునకు పాత్రులుకమ్మని ప్రార్థన.

భవదీయులు,

కావిలిశెట్టి ఆదిశేషయ్యశెట్టి,
హైమవతమ్మ

కార్యక్రమము

19-3-86 తేది బుధవారం 5-00 నుండి 7-00 గంటలవరకు మంగళ వాద్యములతో ఆలయ ప్రవేశము.

20-3-86 తేది గురువారం అగ్ని ప్రతిష్ఠ.

21-3-86 తేది శుక్రవారం

శ్రీ శ్రీ శ్రీ పూర్ణానందస్వాములవారి కరకమలములతో యంత్రస్థాపనము.

ప్రతిరోజూ సాయంత్రం 6 నుండి ప్రత్యేక కార్యక్రమములు.

# పెండ్లిండ్లు

### తాసిల్దారు కుమారుడు

హుజార్ హెడ్‌క్లర్కుగా, తాసిల్దారుగా నెల్లూరు రెవిన్యూశాఖ ద్వారా సుపరిచితుడు, సౌమ్యుడు, మంచివాడూనైన శ్రీ ఎం. శ్రీహరి కుమారుడు, స్టేట్‌బ్యాంకి ఉద్యోగి రాధాకృష్ణ ఎం.ఎం., బి.ఎల్., వాసి. పి. డబ్ల్యు. డి. శాఖలో ...బుల్ పనిచేస్తున్న శ్రీ వి. వెంకట ...య్య కుమార్తె స్వర్ణలత ఎం. ఎ. ...యం 12 తేది నెల్లూరు టౌ... ...లో జరిగింది.

### 'గుర్రం' వధువు

న్యాయవాది, సాహితీ...త్త స్వర్గీయ గుర్రం వెంకటసుబ్రహ్మణ్యంగారి తనయ ...: గూడూరు న్యాయవాది శ్రీ దివరవోలు సుందరరాజారావు కుమారుడు ...శ్వరరావు కల్యాణం 12 తేది నెల్లూరులో వధువు ఇంట జరిగింది.

### డాక్టరు కుమార్తె

రోగులను సాదరంగా చూచే నెల్లూరు పెద్దాస్పత్రి ఇ. ఎన్. టి. స్పెషలిస్టు డాక్టర్ వై. సంజీవరావు కుమార్తె శిరీష; హైదరాబాదు, డా. బి. వి. ప్రసాదరావు కుమారుడు డాక్టర్ సురేంద్ర వివాహం 12 తేది శ్రీ వెంకటేశ్వర కల్యాణ మండపంలో జరిగింది.

### మూడు పెండ్లిండ్లు

నెల్లూరు భవాని ఐ. టి. ఐ. ప్రిన్సిపాల్, కరిస్పాండెంటు శ్రీ ఎం. సి. సుబ్రహ్మణ్యం తన ముగ్గురు తమ్ముళ్ళకు, ఒక చెల్లెలికి 12, 13 తేదీలలో వరుస బెట్టి పెండ్లిండ్లు చేశారు.

చెల్లెలు కళ్యాణికి, స్వర్గీయ బంధువుల నరసింహమూర్తిగారి కుమారుడు శ్రీనివాసులతోను-

తమ్ముడు ధన్వంత్రికి శ్రీ ఉదాలి అంతనారాయణయ్య కుమార్తె సుజాతతోను-

మరో తమ్ముడు పద్మనాభయ్యకు, సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసిన దివంగత ఉదాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారి ఆరవ కుమార్తె భారతితోను-

మూలపేట సంస్కృత కళాశాలలో వివాహాలు జరిగాయి.

### డాక్టర్ల జంట

తన సౌజన్యంతో, రుజువర్తనతో తాసిల్దారుగా నెల్లూరీయుల గౌరవాభిమానాలను చూరగొని, ప్రస్తుతం గుంటూరు ఆర్.డి.ఒ.గా పనిచేస్తున్న శ్రీ సిహెచ్. సత్యనారాయణ కుమార్తె డాక్టర్ సత్యవతి; తెనాలి, డెప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసరు శ్రీ బి. వెంకటరామయ్య కుమారుడు డాక్టర్ కిషోర్‌బాబు వివాహం 13 తేది గుంటూరు రాజాగారి తోటలోని టి.టి.డి. కళ్యాణమండపంలో జరిగింది.

### పిగిలాం పధూవరులు

వెంకటగిరి తాలూకా పిగిలాం మాజీ సర్పంచ్, కాంట్రాక్టు వృత్తిలో రుజాయి పరకు ఎగ్రబాకిన దుమ్మరైన యువకుడు, ప్రస్తుతం నెల్లూరువాసి శ్రీ ఆర్. కె. రాజ కుమార్తె హేమలత; పిగిలాం, శ్రీ కె. లింగరాజ కుమారుడు చెంగల్‌రాజ బి. కాం. (బి. ఎల్.) వివాహం 13 తేది స్టోన్‌హౌస్‌పేట పెళ్ళకూరు అనసూయమ్మ కళ్యాణ మండపంలో జరిగింది.

### ఉమా పరిణయం

విద్యుత్‌శాఖ వింజమూరు ఆడిషనల్ అసిస్టెంటు ఇంజనీరుగా వున్న అలగాని పాడు వ్యాస్తవ్యుడు శ్రీ సిహెచ్. వెంకయ్య కుమార్తె ఉమాదేవి; నెల్లూరు శ్రీ కె. నరసయ్య కుమారుడు వెంకటరమణ ఎం కాం. పరిణయం 14 తేది నెల్లూరు హోటల్ అశోకలో జరిగింది.

### ఇరకం వివాహం

సూళ్ళూరుపేట తాలూకా, ఇరకం సర్పంచ్ శ్రీ ముద్దుకృష్ణ మొదలియార్ తనయ గీత; దేవంపట్టు, శ్రీ ఎం. సుబ్రహ్మణ్యమొదలియార్ కుమారుడు లోగనాథం అనే రమేష్‌కు ఎం. ఎస్‌సి. (బి. జి. ఎల్.) మద్రాసు వడపళనిలోని విజయశేష్‌మహల్‌లో వివాహంజరిగింది.

### పాల్ఘాట్ పెండ్లి

నెల్లూరు చంద్రభవన్ యజమాని శ్రీ ఎం. ఎస్. సూర్యనారాయణ కుమారుడు గణేష్ ఎ. సి. ఎ; పాల్ఘాట్ స్టేట్ బ్యాంక్ రిటైర్డ్ ఆఫీసరు శ్రీ టి. ఎన్. రామలింగయ్యర్ కుమార్తె ఉమ బి.కాం, వివాహం పాల్ఘాట్‌లోని శారద శంకర కళ్యాణమండపంలో ఫిబ్రవరి 12 తేది జరిగింది. ★

# ★ ★ నా మాట ★ ★

## ★ సైంట్ జోసఫ్స్ స్కూలు: ఒక తండ్రి ఆవేదన

చదవేస్తే వున్నమతి జారిపోకూడదు; లేనిమతి రావాలి! మధ్యతరగతి మానిసులు తమ పిల్లలను ఇంగ్లీషు బడులలో చదివించడానికి ఎగబడుతున్నారంటే, వారి అభిమతం ఇదే! 'మమ్మీ' 'డాడీ' అని పిలిపించుకోవాలన్న ముచ్చటే ఈ వేలంవెర్రి అనేది పట్టి దుష్ప్రచారం. విజ్ఞానాభివృద్ధి ఒక నిరంతర పరిణామంగా, ప్రవాహంగా కొనసాగుతున్న ఈ రోజులలో తమబిడ్డలు ఈ తరాక్రవాహంలో మునిగిపోకూడదనే, వెనుకబడకూడదనే తల్లిదండ్రుల తపన, ఇంగ్లీషు కాన్వెంట్ల పంట పండిస్తూంది. ఖరీదైన ఈ చదువుల కొనసాగింపు కోసం, సిగరెట్లు, సినిమాల వంటి సరదాలుకూడా చంపుకొని, తబ్బుకూడగట్టే సంసారులు ఎందరో వున్నారు.

మరి ఎంతో ఆరాటంతో తమదగ్గరకు వచ్చే తల్లిదండ్రుల, పిల్లలఆశలు ఇవి ఎంతమేర తీర్చగలుగుతున్నాయి అన్న ప్రశ్న వేసుకుంటే, సమాధానం సంతృప్తికరంగా వుండదు. మరీ కొన్నిస్కూళ్ళ విషయంలో అసంతృప్తితో అసహనం పెంచుకోవలసివస్తూంది.

సెయింట్ జోసఫ్స్ ఇంగ్లీషుమీడియం స్కూలువిషయమే చూడండి - చెట్టులేని చోట ఆముదపు మహావృక్షంవలె పెరిగిందీ స్కూలు. ఇప్పుడిప్పుడు టౌనులో మంచి ఇంగ్లీషుమీడియం పబ్లిక్‌స్కూళ్లు వస్తున్నా, సైంట్‌జోసెఫ్స్ ప్రాధాన్యత మాత్రంతగ్గలేదు.

మొన్నొకరోజు ఈ స్కూలుపిల్లలను చదివించుకుంటున్న ఒక తండ్రి మా ఆఫీసుకు వచ్చారు; ఆయన చెప్పింది వింటే, అది స్కూలా? సైనిక శిక్షణ కేంద్రమా? అనిపించింది. ప్రతిరోజూ ఉదయం గంట, గంటన్నరసేపు ప్రేయర్ పేరుతో క్రైస్తవమత బోధన చేస్తున్నారట. అంతంతసేపు ఆ ఎండకు తట్టుకోలేక కొందరుపిల్లలు సొమ్మసిల్లి పడిపోతున్నారటకూడా:

ఇదొక్కటే కాదు-స్కూలుబస్‌లో వచ్చే పిల్లలకు గంట ఆలస్యమైనా ఫర్వాలేదట కాని. ఇతరత్రా వచ్చేవారు అరనిముషం ఆలస్యమైనా గేటుదాటి లోనికి రానివ్వరట. బంద్‌లు, తుఫాను వంటి సందర్భాలలో ఎవరైనా పొరపాటున స్కూలు వుందా, లేదా అని విచారించడానికి ఫోన్ చేస్తే, మరునటిరోజు ఆ పిల్లలకు పనిష్మెంట్ ఇస్తారట- ఫోన్ మీకోసం పెట్టామా అని! ఎక్స్‌ట్రకర్చని, అదని, ఇదని పందలకు పందలు తెమ్మంటారట -తేలేనివారిని అవమానంగా చూస్తారట.

తమకష్టాలు ఇట్లా గంటసేపు గడగడ వల్లించాడాయన. విద్యాబోధనలో ఒక గుర్తింపు, గౌరవం పొందిన స్కూలిది. ఇటువంటి సంఘటనలతో మంచిపేరు పోగొట్టుకోవద్దని మనవి. ★

— డోలేంద్ర

## ప్రకటన

నెల్లూరు సబ్ రిజిస్ట్రేషను నవలాకుల తోటల పంచాయితీ సర్వే నం 227/2 పట్టా నం. 13 అందుగల శ్రీ మహమ్మద్ గౌసుబాషాగారి స్థలము పడమటి నైరుతి దిక్కున అన్యాయాక్రమణము జరిగివున్నది. గాన పైన ఉదహరించిన స్థలమును ఎవరైనను విక్రయించిన యెడల అట్టి విక్రయము చట్ట విరుద్ధము పడమటి నైరుతిదిక్కున అన్యాయాక్రమణము చేయబడిన శ్రీ గౌసుబాషాగారి స్థలము మేరకు చెల్లనేరదు.

SYED NAYEEMUDDIN
Advocate, Gandhi Nagar
Nellore.

పిడతాపోలూరు గ్రామపంచాయితీ

## టెండరు ప్రకటన

ఇందుకూరుపేట పంచాయితీ సమితికి చెందిన పిడతాపోలూరు గ్రామపంచాయితీకి 1986 ఏప్రెల్ నుంచి 1987 మార్చి నెలాఖరు వరకు వీధిదీపములకు కావలసిన మెర్క్యురి బల్బులు, ట్యూబ్ లైట్లు, స్క్రూబల్బులు, వాటికి సంబంధించిన అన్ని విడి పరికరములు దఫాలవారీగా సరఫరా చేయుటకు 21-3-86 తేది మధ్యాహ్నం 3-00 గంటలలోగా ఆథరైజ్‌డ్ ట్రాంస్పోర్ట కంపెనీ డీలర్ల నుండి సీల్డు టెండర్లు కోరబడుచున్నవి. టెండర్లను, అదే రోజు సాయంత్రము 3-30 గంటలకు హాజరైన టెండరుదార్ల సమక్షములో తెరువబడును. టెండరు డిపాజిట్టు రూ. 25/- మిగతా వివరములు ఆఫీసు పనిచేయు వేళలలో తెలుసుకొనవచ్చును.

-పి. కోదండరామిరెడ్డి,
సర్పంచ్
పిడతాపోలూరు గ్రామపంచాయితీ



# పినాకినీతీరం

(2వ పేజీ తరువాయి)

ప్రసిద్ధుడుకాదు; దర్శకత్వపు గ్లామర్‌ను ఆయన ఎన్నడూ లోనైనట్టులేదు; నిర్మాతే గాని ఆయన నిర్మించినవాటిలో హిట్ అయిన చిత్రాలు చాలతక్కువ. అయినా ఆయన పోయినదాకినే ఇంటికి తిరిగి రాకుండా చిత్రరంగంలో స్థిరపడిపోయారంటే, దక్షిణ భారత చలనచిత్ర మండలి అధ్యక్షుడుకాగలిగాడంటే; చిత్రరంగంలో అరుదైన నిలకడ, నమ్మకం, నిజాయితీ, పెద్దమనిషితనాలకు పర్యాయపదమై పోయాడంటే, పరహితంగాగౌరవభాజనుడైనాడంటే వ్యక్తిగా, వ్యాపారిగా ఆయనలోని శీలసంపదే కారణంగాని మరొకటి కాదు.

సినీ రంగంలో ఆర్జించుకున్న కీర్తి, శమున్నతస్థానం, సహృదయత, సహాయక ప్రవృత్తి, స్నేహ మాధుర్యం మల్లెమాలను నెల్లూరు ప్రారంభోత్సవాలకు ముఖ్యల్ని చేసివుంటాయి. ఆయన ప్రారంభోత్సవాలు జరిపే సంస్థలు ఆయనవలెనే ఘనంగా స్థిరంగా విజయవంతంగా నిలబడగలవనే ఆశిద్దాము!

## "స్వాతంత్ర్యవాణి"- శేషాద్రి జ్ఞాపకాలు

"నిందిస్తున్న స్వాతంత్ర్యవాణి" అంటూ ఈ శీర్షిక క్రింద (ఫిబ్రవరి 21) నేను చేసిన వ్యాఖ్యను చదివిన ప్రొఫెసర్ కె. శేషాద్రి తన "నెల్లూరు జ్ఞాపకాలు" శీర్షిక క్రింద మరచిపోయిన కొన్ని సంఘటనలను వివరిస్తూ తొలి మాటలుగా ఇలా అంటారు-

"మీరన్నట్లు దేశభక్తులందరూ హైదరాబాదు నగరంలో లేరు. వారు Careerists కానందువల్ల వారివారి స్వంత గ్రామాలలోనే వుండిపోయారు."

శేషాద్రిగారు చివర్న ఇంకొక మాట వ్రాశాను-" మీరు ఆకాశవాణి ప్రోగ్రాం విమర్శిస్తున్నది చదివినందువల్ల ఇవన్నీ చెప్పాలని తోచింది"

అందులో నేను విమర్శించింది స్వాతంత్ర్యవాణి శీర్షికక్రింద శ్రీ గుజ్జల యలమందారెడ్డిగారితో ఆకాశవాణీయుడు జరిపిన ఇంటర్వ్యూని గురించి. స్వాతంత్ర్య పోరాటంలో 1920 ప్రాంతంనుండి అనేకసార్లు జైళ్ళకుపోయి పలు బాధలకు గురియైన వారెందరో వుండగా, వారందరినీ వదలి నగరంలో అందుబాటులో వున్న కారణంగా స్వాతంత్ర్య పోరాటంలో పెద్దగా పాత్రలేని, ఒకవిధంగా ఆ పోరాటానికి వెన్నుపోటు పొడిచినవారిచేత స్వాతంత్ర్య వాణంటూ వినిపింప చేయడం వుచితం కాదని విమర్శించాను. శేషాద్రిగారి తొలి పలుకులు, చివరి మాటలు చదివి, క్విట్ ఇండియా వుద్యమంలో ఆయన అనుభవాలను (ఈ సంచికలోనే 2వ పేజీలో ఇవ్వబడినవి) వివరించడాన్ని చూచి నవ్వాను ఆయనకు నా విమర్శ సముచితమని తోచిందా లేక ఆక్షేపణీయమనిపించిందా అనే ధర్మసందేహం కలుగుతున్నది. "స్వాతంత్ర్యవాణి"లో జైలుకు పోయినవారేకాదు, పోకుండా వుదాత్తంగా పాల్గొన్నవారి వాణికూడా వినిపించడం వుచితమేననేది శేషాద్రిగారి అభిప్రాయమైతే ఆక్షేపణలేదు; కాని అది స్వాతంత్ర్యవాణిగా వుండాలేగాని పాతికమైన పార్టీ వాణిగా వుండకూడదనేది నా అభిమతం.

శేషాద్రిగారివలె స్వాతంత్ర్యోద్యమంలో వుత్తేజితుడుకాని విద్యార్థి ఆనాడు వుండివుంటాడని నేననుకోను. హైస్కూలు చదువులోవుండిన నాబోటి కుంకలే వ్యష్టి సత్యాగ్రహంరోజులలోనే బడికి,పాఠాలకు ఫ్రెంచిలీవ్‌పెట్టి సత్యాగ్రహ సభలు, సత్యాగ్రహుల విచారణజరిగిన గెల్లటి (గూడూరు) కోర్టే లోకంగా గడపంగా, ఆ చిన్నతనంలో ఖద్దరుదీక్షనువహించంగా; ఇక రాజకీయ పరిజ్ఞానం ఎక్కువగా కలిగిన శేషాద్రివంటి కాలేజి విద్యార్థుల సంగతి చెప్పాలా? ఆరోజులను తలచుకుంటే హృదయం వుప్పొంగుతుంది; ఈనాటి విద్యార్థులను చూస్తుంటే హతవిధీ అనిపిస్తుంది!

# బడ్జెట్

(4 వ పేజీ తరువాయి)

అభివృద్ధి కార్యక్రమాలకు కేటాయింపులు తగ్గించడమేకాదు-నిధుల పంపకంకూడా ప్రాధాన్యతాక్రమంలో జరగలేదేమోననిపిస్తుంది.

ఇల్లుచూసి ఇల్లాలిగురించి చెప్పవచ్చునన్నట్లే, టౌనులో రోడ్లనుచూసి ఏ పురపాలక సంస్థ ప్రతిభనైనా వెల్లడించవచ్చు. ఆ కోణంలో నెల్లూరు మునిసిపాలిటీది అధమాధమస్థానం. మునిసిపల్ కౌన్సిల్ వున్న నాలుగు సంవత్సరాలలో, కొత్త లర్లు తమ ఇళ్ళుండే వీధులు బాగుచేసుకున్నారేకాని, టౌను సంగతి పట్టించుకోలేదు. పైగా కౌన్సిలర్ల ముడుపులుపోను పనికి మిగిలిన డబ్బు తక్కువ కాబట్టి వారు వేయించిన రోడ్లు, వారితోటే కొట్టుకొని పోయాయి. నెల్లూరులో ఏ రోడ్డు చూసినా గుంటలు, గతుకులే! రిక్షాల్లో పోతుంటే, వళ్ళు హూనమై పోతుంది. ఎంతో ప్రాధాన్యత ఇచ్చి పునర్నిర్మించవలసిన రోడ్లకు, బడ్జెట్‌లో చిల్లిగవ్వకూడా కేటాయించకపోవడం దారుణమైన అన్యాయం. కమీషనర్ శ్రీ నరసింహంగారు, బడ్జెట్ ప్రతిపాదనలను సవరించి అయినా, రోడ్లకు కొంత మొత్తమైనా కేటాయించడం అవసరం.

లైట్ల విషయంలోకూడా చాలా నిర్లక్ష్యం కన్పిస్తూంది. రెండంటే రెండు లక్షలు కేటాయించారు. నెల్లూరు టౌనులో పలుప్రాంతాలకు సమృద్ధిగా వీధిదీపాల సౌకర్యం ఏర్పడినమాట వాస్తవమేకాని, చంద్రమౌళినగర్ వంటి చోట్ల ఇప్పటికి లైట్లులేవు. అటువంటివీధులకు ఈ ఏడాదైనా మోక్షంకల్పించండి.

దాదాపు దశాబ్దం నుంచి నెల్లూరు మునిసిపాలిటీ దారుణ నిర్లక్ష్యానికి బలౌతున్న అత్యవసర పౌర సౌకర్యం-పార్కులు. ఇంతపెద్ద మహానగరంలో, జనారణ్యంలో పచ్చటి చెట్లనీడ వెతుకుదామన్నా లేదు.

ఇంటింటా చెట్లు, ఊరంతా వనం అనిదే, వాతావరణ కాలుష్యం మానవజాతిని శారీరకంగా, మానసికంగా కృంగదీస్తుందని ప్రపంచమంతా కోడైకూస్తుంటే, మన పురపాలక నేతలుమాత్రం పట్టీపట్టనట్టుండడం క్షేమార్థంకాదు. రోడ్లప్రక్కన చెట్లుకాదు - షటిల్‌వాక్‌లు కట్టడానికికూడా మనటౌనులో చోటులేదు-కనీసం ట్రాఫిక్ ఐలండ్లు, స్వతంత్ర పార్కు, పొస్టల్ కాలనీ తదితర ప్రాంతాలలో మంచి పార్కులు పెంచడానికి, నిర్వహించడానికి కృషిచేయడం అవసరం.

మార్కెట్ నిర్మాణానికి 1981 లక్షల నిధులు కేటాయిస్తున్నారు; ఆచరణ మాత్రం జరగడంలేదు. ట్రెకస్ రోడ్డు స్థలం అనుకూలం కాదనుకుంటే, ఇప్పటి మద్రాసు బస్టాండును అక్కడికి తరలించి, బస్టాండు, మునిసిపల్ అతిథి గృహాలను ఖాళీచేసి, అక్కడైనా మార్కెట్ కడితే నెల్లూరీయులు నరసింహంగారి పేరు చిరకాలం చెప్పుకుంటారు. ఫిషరీస్ ఆఫీసును ఆనుకొని వున్న పెద్ద కోనేరును స్విమ్మింగ్‌పూల్‌గా మార్చడమో, లేదా దాన్నికూడా మార్కెట్ భవనాలకు వినియోగించడమో చేస్తే బాగుంటుంది.

లంగర్‌ఖానా ఇప్పటి పరిస్థితులలో దండగ, దానికి పెట్టే నలభైవేలు, పార్కులకో, మరో పౌర సౌకర్యానికో వినియోగించడం మంచిది.

డ్రైనేజికి 25 లక్షలు కేటాయించారు. బాగానేవుంది. కొత్తవాటి సంగతి దేవుడెరుగు, వున్నవికూడా సక్రమంగా పని చేయడంలేదే-ఎందువల్ల?

పొదలకూరురోడ్డు, పప్పులవీధి పార్కులలో నిర్మిస్తున్న రెండు నీటిపథకాలు పూర్తయితే టౌనులో 90 శాతం నీటి కరువుతీరుతుంది.

అసలు నెల్లూరు మునిసిపల్ భవనమే పాడుబడి, మునిసిపాలిటీ వలెనే దిగాలుగా, దీనంగా, దరిద్రం కొట్టుకుంటున్నట్లు వుంది. శతమానం పూర్తిచేసుకున్న సందర్భంలోనైనా, మునిసిపాలిటీకి మంచి భవనం కట్టించుకోకూడదా ?

## నంది అవార్డు

(13వ పేజీ తరువాయి)

మధ్యాహ్నం తనకు వచ్చిన విగ్గుతో ఆ తార కరెక్ట్‌టైంకు షూటింగ్‌కు హాజరయింది.

నిర్మాత ఎంతో సంతోషించాడు. కాని ఆయనకు ఆకర్యాత తెలిసింది, ఆ తార ఏదో తమిళపిక్చర్‌లో ఇదివరకు ఆవిగ్గును ధరించి, షూటింగ్ అయిపోయాక ఇంటికి తెచ్చుకునేసిందని!

ఈ తెలుగు పిక్చర్ షూటింగ్ ముగిశాక కూడా ఆ తార ఆవిగ్గును తనఇంటికి తీసుకెళ్ళిపోయింది.

"ఈ విగ్గుతో ఇంకో ప్రొడ్యూసర్‌ని క్షవరంచేస్తుందిమె," అనిసవ్వుకున్నారు నిర్మాత! చిత్రసీమలో ఇటువంటి తారలెందరో!

★

## సినిమా వార్తలు

(13 వ పేజీ తరువాయి)

గాడ్‌ఫాదర్‌లాంటి ప్రముఖులు డి.వి.ఎస్. రాజు. ఈయన చిరంజీవి, విజయశాంతి జంటతో కె. రాఘవేంద్రరావు దర్శకత్వంతో నిర్మించే చిత్రం గొప్పసంచలనం కలిగిస్తుందని చిత్రపరిశ్రమలో పలువురు భావిస్తున్నారు. సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, పి. ఎల్. నారాయణ, ఈశ్వరరావు, మాడా, రాజ్యలక్ష్మి, వై. విజయ, తక్కిన నట వర్గం.

# నంది అవార్డుల పట్ల చిత్ర సీమలో నిర్లిప్తత

నంది అవార్డులకోసం 1985 లో తయారైన చిత్రాల ఎంట్రీలను ఆహ్వానిస్తూ రాష్ట్ర ప్రభుత్వం కొన్ని పత్రికలలో ప్రకటనలు చేసినా, ఏ కొందరో తప్ప ఇతర నిర్మాతలు ఏమంత ఆసక్తి చూపిస్తున్నట్లు లేదు. అందరూ డబ్బుచేసుకోవడంలో నిమగ్నులై వున్నారు. అసలు వాళ్ళకు కావలసింది అవార్డు కాదు; కొను గోలుదారుల నుంచి డబ్బు. అందుకు హడావిడిగా రీళ్ళు చుట్టేయాలి. అందరూ ఆ పనిలోనే వున్నారు.

రాష్ట్ర ప్రభుత్వమేకాక మరోవంక మద్రాసు, హైదరాబాద్ వంటి నగరాల లోని కొన్ని సాంస్కృతిక సమితులు కూడా ఉత్తమ చిత్రాలు వగైరాలను ఎంపిక చేస్తున్నాయి. ఒకదానికి మరొక దానికి ఎక్కడా పొంతన వుండడంలేదు. కొన్నిచోట్ల పరమ చెత్తచిత్రాలుకూడా వుత్తమమైనవిగా ఎన్నిక కావడంవల్ల అసలు కొంతకాలం పోయాక ఈ అవార్డులకు విలువే వుండదేమో ననిపిస్తుంది; నిజమే! ఈ ఉత్తమ చిత్రాల ఎన్నికలో ఒక్కొక్కరు ఒక్కొక్క పద్ధతిని అవలంభిస్తున్నారు. కొందరు పలుకుబడిచేత, మరికొందరు 'తైలం'చెల్లించి, అవార్డులు సంపాదించుకుంటున్నారు. అందుకే, ఈ అవార్డులవల్ల ఉత్తమచిత్రాలు తయారవుతాయా అని కొందరు విజ్ఞులు నవ్వుకుంటున్నారు.

## కన్నడంలో కృష్ణ సమర్పించే "లవకుశ"

కృష్ణ చేసేటన్ని తెలివైన పనులే. తెలుగులో సూపర్‌హిట్ అయిన "లవకుశ"ను కన్నడంలో రూపొందిస్తున్నారు పద్మాలయ బానర్‌తో. ప్రముఖ కన్నడ హీరో రాజ్‌కుమార్ శ్రీరాముడు. జయప్రద సీత. రాజ్‌కుమార్ పుత్రుడు పునీత్

> మా మద్రాసు
> సినీ ప్రతినిధి

లవుడుగా నటిస్తున్నాడు. నెల్లూరీయుడు సింగీతం శ్రీనివాసరావు డైరెక్టరు; కృష్ణ తమ్ముడు జి. ఆదిశేషగిరిరావు నిర్మాత.

## ఫిలిమ్ ధర పెరిగిపోయింది

కొత్త బడ్జెట్‌లో ముడి ఫిలిమ్‌మీద ఏ విధమైన పన్ను లేకపోయినా ధరమాత్రం విపరీతంగా పెరిగిపోయింది. అడిగినంత ఇచ్చిస్తేకాని దొరకడంలేదు మార్కెట్లో. ఆర్టిస్టుల కాల్షీట్లు. అన్నీ సిద్ధం చేసుకున్న నిర్మాత ఫిలిమ్ లేకపోతే ఏంచేయగలడు? అందేత, చచ్చినట్లు ఎంత రేటయినా కొనక తప్పడంలేదు.

## విగ్గుకోసం కోసం

షూటింగ్‌కు అంతాసిద్ధంగా వున్నారు. హీరోయిన్ ఎప్పుడొస్తారా అని ఎదురు చూస్తూ! ఇప్పటికి ఆమె రానేవచ్చింది విసురుగా. సరాసరి నిర్మాత దగ్గరికెళ్ళి, "ఇదేం విగ్గండీ! నా తలకు ఇదెలా సరిపోతుంది? లక్షలు పెట్టి ఈ సినిమా తీస్తున్న మీరు కేవలం విగ్గుదగ్గర డబ్బుకు కక్కుర్తిపడితే ఎలా? మీ సినిమాను జనం చూడాలా, అక్కర్లేదా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది. నిర్మాత దిగాలుగా డైరెక్టర్ వంక తిరిగాడు: డైరెక్టరు కోపంగా ప్రొడక్షన్ మేనేజర్ వంక చూశాడు: "ఆమెగారి ఫేస్‌కు ఈ విగ్గే సూట్ అవుతుందని ఆర్ట్ డైరెక్టర్ చెప్పాడండి, "అన్నాడు ప్రొడక్షన్ మేనేజర్. బిక్కుబిక్కుమంటూ.

మళ్ళీ ఆతార ఆకాశమంతెత్తుకు లేచింది. "ఆర్ట్ డైరెక్టర్‌కేం తెలుసండీ ఆడదాని విగ్గు గురించి? మీరు కొన్న విగ్గునుగనక నేను వేసుకునినటిస్తే అంతే-స్క్రీన్‌మీద నన్ను జనం చూడలేరు. నాకిక బుకింగ్‌లురావు. అందేత, ఈపూట షూటింగ్ కేన్సిల్‌చేసి, మధ్యాహ్నం నుంచి పెట్టుకోండి. ఈలోగా వెయ్యి రూపాయలిట్లాపడేస్తే నేనూ, మా మేకప్ మేన్ వెళ్ళి నాకు సరిపోయే విగ్గు తెచ్చుకుంటాం" అంది.

పాపం! నిర్మాత ఏంచేస్తాడు? ఆమె చెప్పినట్లే ఆ డబ్బు చెల్లించక తప్పలేదు.

—కొరవ 12వ పేజీలో

ప్రతిధ్వనిలో మాడా, అనూరాధ, అల్లు రామలింగయ్య.

# సింహాసనాన్ని మించిన చిత్రం కృష్ణే తీస్తున్నాడు

"సింహాసనం" తర్వాత హీరో కృష్ణ మరో భారీచిత్రాన్ని డైరెక్టు చేయబోతున్నాడు. ఇదికూడా తెలుగు, హిందీ భాషల్లో 70 ఎం. ఎం., స్టీరియో ఫోనిక్ సౌండ్‌లో తయారవుతుంది. హిందీలో జితేంద్ర, ధర్మేంద్ర హీరోలు. తెలుగులో కృష్ణతోపాటు ధర్మేంద్ర నటిస్తారు. అక్టోబర్‌లో షూటింగ్ ప్రారంభమై, నాలుగు మాసాలపాటు జరుగుతుంది. ఇది "సింహాసనం" కన్నా భారీ ఎత్తున తయారవుతుంది. సంగీతం: బప్పీలహరి.

> సినిమా వార్తలు

## డి. వి. రాజు చిత్రం

తెలుగుసినిమా రంగంలో అందరికి

—కొరవ 12 వ పేజీలో

## తెలుగు సినిమా సహారాలో నిర్మలమైన ఒయాసిస్సు

# స్వాతిముత్యం

**గిద్దలూరు గోపాలరావు**

దర్శకుడు కె. విశ్వనాథ్, నిర్మాత ఏడిద నాగేశ్వరరావు సంయుక్తంగా సాగించే కళాతపస్సు పండించిన మరో మధురఫలం "స్వాతిముత్యం". కళామతల్లి వారికి ప్రసాదించిన కీర్తికిరీటంలో యీ చిత్రం మరో కలికితురాయి.

తెలుగు సినిమారంగమనే సహారా ఎడారిలో, కళాదాహంతో ప్రయాణించే సినీబాటసారులకు సేదతీర్చే నిర్మల జలాశయం ఈ చిత్రం.

స్వాతిముత్యంలో కథవుంది. ఆకథకు బలంవుంది. ఆ బలంలో అతి ముఖ్య విషయముంది. ఆ విషయం పుష్టిగా పోషించబడింది. ఆ పోషణలో విశ్వనాథ్ కళాసృష్టి అపూర్వమనిపించింది.

సంపన్నకుటుంబంలోని ఒక యువకుడు పేదరాలైన లలితను వివాహమాడటంతో తండ్రి ఆగ్రహానికిగురై ఇంటికి దూరమవుతారు. ఒకబిడ్డ పుట్టిన తర్వాత అతను చనిపోతాడు. బిడ్డతో అత్తగారింటికి వచ్చిన లలితను మామగారు తరిమికొట్టారు. అన్నగారి ఇంటవున్న లలిత, వదిన బాధలకు గురవుతుంది. ఆమెను కష్టాలనుంచి కడతేర్చేందుకు రామాలయంలో సీతాకళ్యాణం ఉత్సవంరోజు శివయ్య అనే పల్లెటూరి చిన్నవాడు అమాయకంగా ఆ మంగళసూత్రాన్ని తెచ్చి లలితమెడలో కట్టాడు. ఆమెకు తోడుగానీడగా నిలుస్తాడు. ఆమె కొడుకు బాలసుబ్రహ్మణ్యాన్ని చదివించి అభివృద్ధికి తెస్తాడు. ఆమె చనిపోయినా, మునలితనంలో కూడా అమాయకంగానే ఆమె ఆత్మశాంతిని కోరుతుంటాడు. కొడుకులు, కోడళ్ళు, మనవళ్ళు, మనవరాళ్ళ చేత పూజింపబడతాడు.

ఈ కథ ఒక అమాయకుని నిస్వార్థ జీవితయాత్ర అని చెప్పవచ్చు. కథకంతా పల్లెటూరి అమాయకుడైన శివయ్య ప్రాణం. అరణ్యవాసంలో శ్రీరాముడు గడ్డిపోచను మంత్రించివదిలితే అది దివ్యాస్త్రమైనట్లు, విశ్వనాథ్ పల్లెటూరివాసియైన శివయ్యను అమాయకత్వంతో మలచి విసిరితే అవి పైశాచికత్వంగా నిలిచాయి.

శివయ్య అమాయకుడేగానీ అసమర్థుడు కాడు. అతని అమాయకతలో మంచి చెడు అనుభవిత మరిచే ఆలోచనాశక్తివుంది. అమాయకత్వానికితోడుగా విశ్వనాథ్ మరో రెండు సాధనాలు సమకూర్చాడు. ఒకటి ఎప్పుడూ అతని చంకను వ్రేలాడే గొడుగు, ఇంకొకటి అప్పుడప్పుడూ చేతిలో కదిలే వెదురుపిల్లనగ్రోవి వాయిద్యం అమాయకత్వానికి అద్దాన్ని. పరమార్థాన్ని రంగరించినట్లే ఈ రెండు సాధనాలకుకూడా సార్థకతను కూర్చాడు విశ్వనాథ్. ఎండకు, వానకు రక్షణలాగా, బాధలకు వ్యాధులకు గురయ్యే వారిని ఆదుకునే శివయ్య హృదయంగా ఆ గొడుగును చూపాడు. అలాగే మమత, మానవత స్వరాలుగా పలికేందుకు శివయ్య ఎదను పొదిగిన అనురాగసుధగా ఆ వెదురు వాయిద్యాన్ని చూపాడు.

శివయ్యలో మరో గొప్ప వైవిధ్యం కనుపిస్తుంది. పోతన భాగవతాన్ని వివరించిన శ్రీ శుకమహర్షిలో స్త్రీలు, పురుషులు అన్న భేదభావం కనుపించదు. ఈ నిర్వికల్పమను శివయ్యలో చక్కగా చూపాడు విశ్వనాథ్. నదీజలాలలో అర్ధనగ్నంగా స్నానంచేస్తున్న ఒక యువతి ఆ దారిన పోతున్న శివయ్యను వీపు రుద్దమంటుంది. అతను అమాయకంగా అంగీకరిస్తాడు. అతనిచేతిస్పర్శకు ఆమె చలించదు. శివయ్య అలా పోగానే వేరొకతను వెనుకచాటుగావచ్చి ఆమెవీపు రుద్దుతాడు. ఆమె సిగ్గుతో ఎవరది అంటుంది. ఎలాగు రించావుంటాడు అతను. చేతితాకిడిలోనే మనసుపోకడ తెలుస్తుంది అంటుందామె. ఎటువంటి బాధలుఎలాంటి మైలు అంటనిమనిషి శివయ్య. అందుకే అతను స్వాతిముత్యం.

అమాయకుడైన శివయ్య తాను మంచిదని నమ్మిన సిద్ధాంతంకోసం ముందుకు సాగిన ప్రతిసన్నివేశం బాగుంది. లలిత కుమారుని ఆరోగ్యంకోసం నిప్పుల గుండంలో నడవడం, వాడి చదువుకు ఫీజుకోసం భిక్షాటన చెయ్యటం, వీధుల్లో విల్లువిని కమ్చీతో వీపుమీదకొట్టుకోవటం, వితంతువైన లలిత బాధలు తీర్చేందుకు ఆమె మెడలో తాళికట్టడం, లలిత మామగారు మనసు మార్చుకొని ఆమెను, ఆమె కొడుకును దగ్గరకుతీసినప్పుడు వారిసుఖం కోసం తాను వారికి దూరంగావుండేందుకు అంగీకరించడం లాంటి సన్నివేశాలు శివయ్య మనోసౌందర్యానికి ప్రతీకలు.

లలిత ప్రోత్సాహంతో ఏటిలో సాగిన శివయ్య సంగీతసాధన, పసివాడిలా అతనువేసిన చిందులు, దేవుడి గుడిమెట్టు నీటితో కడిగినతీరు, ఉద్యోగం యిప్పిస్తానన్న వ్యక్తి ఎదుటమౌనంగా అనుక్షణం ప్రత్యక్షంకావటం .... ఇవి శివయ్య అమాయకత్వపు ఆలాపనలో పులికిన హాస్యవల్లరులు.

ఇక శివయ్యను లలితతో దాంపత్య సుఖానికి దింపినతీరు పసందుగావుంది. మొదటినుంచి శివయ్యకు ఒక అలవాటు పెట్టాడు విశ్వనాథ్. ఎవరైనా తమాషాగా చేత్తో శివయ్య వీపుమీదనో, తలమీదనో తట్టాలనుకోండి. అతనుగూడా అలాగే చేస్తాడు పెదవిరాటని చిరునవ్వుతో. ఇలా ఎవరైనా తనపై చిలిపిగా చేసిన చేష్టను అతను అమాయకంగా తిరిగిచేస్తుంటాడు. శివయ్య, లలితలు చిలకా గోరింకలయ్యేందుకు ఈ అలవాటును నాజూకుగా ఉపయోగించుకున్నాడు దర్శకుడు. మొదట లలితచేత శివయ్య చెక్కిలి నిమిరించాడు. శివయ్య తిరిగి ఆమె చెక్కిలి నిమురుతాడు. ఆమె అతన్ని కౌగలించుకుంటుంది, అతనూ కౌగలించుకుంటాడు. ఆ విధంగా ఆ అమాయకునిలో రసికత్వాన్ని పూరించి రంగంలోకి దించేస్తాడు దర్శకుడు. ఇందులో దర్శకుని భావభంగిమ రసమయ భరితంగా రాణిల్లింది.

విశ్వనాథ్ మేధాసంపద ప్రతిసన్నివేశాన్ని సుసంపన్నం చేసింది. తనలోని కళానిధులను దోసిళ్ళతో పంచిపెట్టున్న విశ్వనాథ్‌కు కళాంజలిఘటించకతప్పదు.

పాత్ర ప్రయోజనాన్ని తన ప్రతిభతో పుటికి పుచ్చుకున్న నటుని ప్రయోగం ఎప్పుడూ కళాపూర్ణోదయమవుతుంది. దీని నిర్ధారణ శివయ్య పాత్రను పోషించిన కమల్‌హాసన్‌లో జరిగింది. తన యావత్తు నటనాశక్తిని పెట్టుబడిగా పెట్టి విశ్వాసం నిలుపుకున్న శివయ్య పాత్ర యితనికళాజీవితంలో మరోమైలురాయిలా నిలిచింది.

లలితగా రాధిక ఆకారంలోను, అభినయంలోను నాణ్యత దిద్దుకుంది. సోమయాజులు, వీరభద్రరావు, గొల్లపూడి, మాస్టర్ వెంకటేశ్వర్లు, నిర్మల, దీప పాత్రోచితంగా నటించి మెప్పించారు.

అక్షరంగూడా వృధాగాని సాయినాథ్ మాటలు ప్రతిపాత్రకు ఘనత చేకూర్చాయి. ఆత్రేయ, సి.నా.రె. పాటలు అందాలవాలతై అలరించాయి. శైలజ కంఠంలో పాటలు హాయి అనిపించాయి. ★

ప్రతిధ్వనిలో, అర్జున, రజని



Phone : 3402

## శ్రీ తల్పగిరి రంగనాథస్వామివారి దేవస్థానము-నెల్లూరు.

# బ్రహ్మోత్సవ ఆహ్వాన పత్రిక

శ్రీ తల్పగిరి రంగనాథస్వామివారి బ్రహ్మోత్సవములు స్వస్తిశ్రీ చాంద్రమాన క్రోధననామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ దశమి శుక్రవారము 21-3-86 తేది మొదలు ఫాల్గుణ బహుళ షష్ఠి సోమవారము 31-3-86 తేది వరకు జరుగును. కావున భక్తులెల్లరు పై ఉత్సవములకు విచ్చేసి, శ్రీస్వామివారిని సేవించి, తీర్థప్రసాదములు స్వీకరించి శ్రీస్వామివారి కృపకు పాత్రులుకాగోరుచున్నాము.

ధర్మకర్తల మండలి : శ్రీ ఆనం వివేకానందరెడ్డి, చైర్మెన్, శ్రీ పత్తి రవీంద్రబాబు ట్రస్టీ, శ్రీ దొడ్డవరపు శ్రీనివాసరావు ట్రస్టీ, శ్రీ తాళ్ళపాక రమేష్‌రెడ్డి ట్రస్టీ, శ్రీ మంకు వెంకటేశ్వర్లు, ట్రస్టీ, డాక్టర్ చక్రవర్తి వీరరాఘవన్ ట్రస్టీ, శ్రీ ముంగమూరు రాధాకృష్ణారెడ్డి ట్రస్టీ.
ఎన్. పాపయ్య కార్యనిర్వహణాధికారి

| తేది | ఉత్సవములు | ఉభయకర్తల పేర్లు | కార్యక్రమము | ద్రవ్యసహాయ దాతలు |
|---|---|---|---|---|
| 21_3_86 | అంకురార్పణము | స్వర్గీయ శ్రీ ఆనం రంగారెడ్డిగారి కుమారుడు<br>శ్రీ గోపాలకృష్ణారెడ్డిగారు | — | — |
| 22_3_86 | ధ్వజారోహణము<br>(బంగారు తిరుచ)<br>శేష వాహనము | లేట్ కోలాటం మస్తానయ్యశెట్టిగారి వారసులు | — | — |
| 23_3_86 | సూర్యప్రభ<br>హంస వాహనము | స్వర్గీయ మాగుంట రాఘవరెడ్డిగారి కుమారులు<br>శ్రీ సుబ్బరామిరెడ్డి, శ్రీ సుధాకరరెడ్డి,<br>శ్రీ శ్రీనివాసులురెడ్డిగారలు | చింతా ఈశ్వరశర్మభాగవతార్<br>గారిచే హరికథా కాలక్షేపము | దేవస్థాన ధర్మకర్తల<br>మండలి |
| 24_3_86 | సింహవాహనము<br><br>చంద్రప్రభ | శ్రీ కోటారెడ్డి రంగారెడ్డిగారు<br><br>శ్రీ పోకూరు సుబ్బారావు ఉరఫ్ నరసింహదాను<br>స్పెసిఫిక్ ఎండోమెంటునుండి | శ్రీ బాలత్రిపురసుందరి నృత్య<br>నికేతన్ నాట్యమయూరి కుమారి<br>సుజీవన అండ్ పార్టీ నెల్లూరు<br>వారిచే భరతనాట్యం | శ్రీ పోకూరు సుబ్బారావు<br>ఉరఫ్ నరసింహులుదాను<br>నిర్దిష్టధర్మాదయనిధినుండి |
| 25_3_86 | (వెణ్ణితాళి)బంగారుపల్లకి<br>హనుమంత సేవ | శ్రీమతి రేబాల సుజాతమ్మగారు<br>శ్రీ రేబాల హరిశ్చంద్రారెడ్డి | శ్రీ శ్రీనివాసనాట్యమండలి (రిజి)<br>ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమి<br>అనుబంధసంస్థ నెల్లూరువారిచే సీ తా క ళ్యా ణ ము<br>పౌరాణిక నాటకము ప్రదర్శనము | శ్రీ ఆనం గోపాలకృష్ణారెడ్డి |
| 26_3_86 | మోహిని అవతారము<br>(పల్లకి)<br>పూలంగిసేవ<br>బంగారు గరుడసేవ | శ్రీ సిద్దవరపు చంద్రశేఖరరెడ్డి<br>శ్రీ సిద్దవరపు శివకుమార్ రెడ్డిగారలు<br>శ్రీ మాగుంటగోపాలరెడ్డిగారు<br>శ్రీ సిద్దవరపు చంద్రశేఖరరెడ్డి<br>శ్రీ సిద్దవరపు శివకుమార్ రెడ్డిగారలు | శ్రీ స్వాతి స్వామినాథ్ అండ్<br>పార్టీ హైదరాబాదువారిచే<br>కూచిపూడి భరతనాట్యము | శ్రీ నాయుడు దశరథ<br>రామిరెడ్డి |
| 27_3_86 | అక్షతారోపణ<br>కళ్యాణోత్సవము<br>గజవాహనము | శ్రీ కంచె వెంకటకృష్ణయ్య,<br>శ్రీ చిన్ని పాపయ్య,<br>శ్రీ వెంకటసుబ్బయ్య వగైరాలు | విజయకుమార్ అండ్ పార్టీ<br>మద్రాసువారిచే<br>భ ర త నా ట్య ము | శ్రీ మాగుంట సోదరులు |
| 28_3_86 | (తిరుత్తేరు)రథోత్సవం<br><br>పొన్నవాహనోత్సవం | లేటు అయితా సుబ్బరామయ్యశెట్టి<br>దత్త కుమారుడు శ్రీ అయితా సుబ్బారావుగారు<br>శ్రీ సిద్దవరపు రామలింగారెడ్డి, శ్రీ విజయ<br>భాస్కరరెడ్డి, శ్రీ మధుసూధనరెడ్డి, శ్రీ అనంత<br>శివరామకృష్ణారెడ్డిగారలు | డాక్టర్ వెంపటి చినసత్యం అండ్<br>పార్టీ కూచిపూడి ఆర్టు అకాడమి<br>మద్రాసు వారిచే కూచిపూడినాట్యము | శ్రీ సిద్దవరపు<br>మధుసూదనరెడ్డి |
| 29_3_86 | తిరుపార్‌వేట్టై<br>అశ్వవాహనము | శ్రీ పారుపూడి కృష్ణారావుగారు మరియు<br>ఆత్రవణం కుటుంబమువారు | ముమ్మడివరం వాస్తవ్యులు<br>నిట్టలా సోదరులదళంవారిచే బుర్రకథ | శ్రీ కొండా<br>మల్లికార్జునరెడ్డి |
| 30_3_86 | ముసుగులసేవ ప్రణయ<br>కలహోత్సవం(తీర్థవాది)<br>పుణ్యకోటి విమానము | శ్రీ నాతా వెంకటసత్యనారాయణగారలు<br><br>శ్రీ కొండా మల్లికార్జునరెడ్డిగారు | శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి<br>శిష్యబృందం — జై హింద్ నృత్య<br>మండలి నెల్లూరువారిచే భ ర త నా ట్య ము | శ్రీ మాగుంట గోపాలరెడ్డి |
| 31_3_86 | ధవనోత్సవము<br>ధ్వజావరోహణము | స్వర్గీయ కొండపల్లి అమ్మణమ్మగారి తరపున<br>తమ్ముడు శ్రీ వెలిదండ్ల కేశవరావుగారు | | |

తేది 22_3_86 మొదలు 26_3_86 వరకు ప్రతిదినము సాయంత్రం గం. 6_00 మొదలు 8_15 గం. వరకు ఏకాంత సేవ, ఊంజల్ సేవ శ్రీ కొండా మల్లికార్జునరెడ్డి, బి. కాం., బి. యల్., అడ్వకేటు, గాంధీనగర్, నెల్లూరు వారిచే వైభవముగా జరిపించబడును.

విద్యుద్దీపాలంకరణ : రామా ఎలక్ట్రికల్ వర్క్స్ — నెల్లూరు

సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు నెల్లూరు శ్రీరామమూర్తి, జమీన్ రైతు ప్రెస్. 17/170. తిప్పరాజువారి వీధి. నెల్లూరు-524001